# చిలకమూర్తి
# జీవితం-సాహిత్యం

డా॥ ముక్తేవి భారతి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

CHILAKAMARTI JEEVITHAM - SAHITYAM
by Dr. Muktevi Bharati

ప్రచురణ నెం. : 2249
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : ఫిబ్రవరి, 2001



వెల: రూ.25-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29. ఫోన్: 3229831

# ఇందులో...



★ ★ ★

# చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు
## (26-9-1867 - 17-6-1946)

ఒకే వ్యక్తి చిన్న వయసులో గొప్ప నాటకకర్త కావటమూ, ఆ నాటకం లక్షప్రతులకు పైగా అమ్ముడు కావటమూ, ఆ వ్యక్తే సాంఘిక, చారిత్రక, పౌరాణిక నవలాకారుడు కావటమూ, సంఘ సంస్కర్తయై ప్రహసనకర్త కావటమూ, పంచములకై పాఠశాల స్థాపించటమూ, పత్రికా నిర్వాహకుడై సాహిత్యసేవ చేయటమూ – ఇలా ఎన్నెన్నో జీవితకాలంలో ఒకే వ్యక్తి సాధించటం సాధ్యమా అని ఆలోచిస్తే – వెంటనే అసాధ్యమనే అనిపిస్తుంది ఎవరికైనా. కానీ ఆ అసాధ్యాన్ని సాధ్యం చేసిన మహనీయుడు పున్నయ్య! – ఆయనే చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు

చామర్తి సుబ్బమ్మగారు చిలకమర్తి మేనత్త ఆమె కూతురు పున్నమ్మ ప్రసవించి మరణించింది ఆ మరణించిన పున్నమ్మ, చిలకమర్తి తల్లికి కలలో కనిపించి, పుట్టిన పసివాడికి తనపేరు పెట్టమని కోరిందట. అప్పటినుంచి ఆ పిల్లవాడిని బంధువులంతా పున్నయ్య అని పిలిచారు. కానీ, చిలకమర్తి తండ్రి, నాయనమ్మ ఆ పేరుకి యిష్టపడక, అంతర్వేదిలోని లక్ష్మీనరసింహస్వామి పేరు పెట్టారు. అప్పటినుంచి లక్ష్మీనరసయ్య అని, లక్ష్మీనరసింహమని పిలువబడ్డ ఇతడు లక్ష్మీనరసింహం పంతులుగా అందరిచేత గుర్తింపబడిన సాహితీమూర్తి

ప్రభవ సంవత్సర భాద్రపద బహుళ చతుర్దశి నాటి రాత్రి మొదటిభాగంలో, పుబ్బ నక్షత్రంలో, ఖండవల్లి గ్రామంలో మేనమామ పురాణపండ మల్లయ్య శాస్త్రి గారింట్లో జన్మించాడు లక్ష్మీనరసింహం అంటే ఇంగ్లీషు తారీఖుల ప్రకారం 1867 వ సంవత్సరం సెప్టెంబరు నెల 26 వ తారీఖు (స్వీయ చరిత్ర – 27వ పేజీ). తాతగారి పోలికతో బక్కపలుచగా, పొడుగ్గా వుండేవారట తాతగారి పోలికే కాదు. "రవ్వంత కవిత్వ ధోరణి, అంధత్వము సిద్ధించినవి" అని చిలకమర్తివారే చెప్పారు (స్వీయచరిత్ర 29) చిలకమర్తికి కంటిచూపు సరిగా లేకపోబట్టి జ్ఞానము వచ్చిన తర్వాత రాత్రులు స్వయముగా నడవలేకపోయేవారు రాత్రులు చదువుకోలేకపోయేవారు. పాఠశాలలో నల్లబల్లమీద వేసిన అంకెలు కనబడేవికావు. బంతి ఆట ఆడుకొనేప్పుడు బంతి పట్టుకోలేకపోయేవారు. పాఠములు చదవవలసి వస్తే మిత్రులచే చదివించుకొని వినేవారు.

చిలకమర్తికి బాల్యంలో సంధ్యావందనం నేర్పించేందుకు తండ్రి వెంకన్న చాలా ప్రయత్నాలు చేశాడు. తాతగారి గ్రామమైన ఖండవల్లిలోను, తర్వాత పెదతల్లిగారి గ్రామమైన వెలగదుర్రులోను, తర్వాత పినతల్లిగారి గ్రామమైన మంచిలిలోను, కొంతకాలం

వుండి సంధ్యావందనం నేర్చుకున్నా, అది పూర్తిగా రాలేదు తండ్రి వెంకన్నగారు, వీరవాసరానికి చిలకమర్తిని తీసికెళ్ళారు. ఆ దగ్గరలోవున్న మత్స్యపురి గ్రామంలో వుండే చిలకమర్తి వారి జ్ఞాతులైన చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి దగ్గర మళ్ళా సంధ్యావందనం నేర్చుకొనేందుకు ఏర్పాటుచేశారు అక్కడ వారింట్లో కొన్ని నెలలుండి త్రికాల సంధ్యావందనం క్షుణ్ణంగా నేర్చుకున్నాడు

వీరవాసరంలో లక్ష్మీనరసింహం బడిలో చేరాడు. ఆ ఊర్లోవున్న "వెలిచేటి వారి" బడిని వెలిచేటి రాయప్పగారు, భద్రాచలంగారు అనే అన్నదమ్ములు పెట్టారు ఆ అన్నదమ్ములే "నాకు ప్రథమ గురువులు" అని చెప్పారు లక్ష్మీనరసింహంగారు (స్వీయచరిత్ర – 38). తర్వాత సోమంచి నర్సయ్యగారి బడిలో చేరి గిలకల పద్యాలు గంభీరమైన కంఠంతో శ్రావ్యంగా చదివితే, పంతులుగారు చాలా మెచ్చుకొన్నారు తర్వాత మేనమామ మల్లయ్యశాస్త్రి గారితో కొండపల్లి వెళ్ళి, అక్కడ మిషను పాఠశాలలో చేరాడు లక్ష్మీనరసింహం. ఆ ఊరి చివర కొండమీదున్న ఆ పాఠశాలకి మేనమామతో కలిసి నడిచివెళ్ళేవాడు. కానీ ఆ ఊరి నీరు పడకపోవటంతో మేనమామ, లక్ష్మీనరసింహము కూడ ఆ కొండపల్లి వదిలివేయవలసి వచ్చింది

1878 లో, అంటే 11 సంవత్సరాల వయస్సులో వీరవాసరంలో దొరతనం వారి పాఠశాలలో లక్ష్మీనరసింహం మొదటి తరగతిలో చేరాడు (అంటే ఇప్పటి ఆరోక్లాసు). ఆ పాఠశాల మట్టిగోడలతో కట్టబడి, చాలా శిధిలావస్థలో వుండటంతో, గ్రామం మధ్యలో ఒక ఇంట్లోకి పాఠశాలను మార్చారు. 1879 లో రెండోతరగతి, 1880 లో మూడోతరగతి చదివాడు కానీ లెక్కలలో ఇష్టం వుండేదికాదు "నేను మూడవ తరగతి చదువుచున్నపుడు గణితములో మిక్కిలి వెనుకబడి యుంటిని తెలుగులోను, ఇంగ్లీషులోను, దేశ చరిత్రలోను, భూగోళములోను ప్రజ్ఞావంతుడనే కాని గణితములో సమర్థత తక్కువ" అని లక్ష్మీనరసింహంగారు చెప్పారు (స్వీయచరిత్ర – 54). దీనికి కారణం కూడా చెప్పారు సహజంగా లెక్కలపై ఆసక్తి లేకపోవట మొకటి. రెండోది దృష్టిదోషం. బల్లమీద వేసిన అంకెలు కనబడేవి కావు. లెక్కలలో తప్పులు చేస్తున్నందుకు ఒకసారి రెండు చేతులమీద ఇరవైకన్నా ఎక్కువ దెబ్బలు తిన్నాడు.

నాల్గవ తరగతికి వచ్చేసరికి, తెలుగు వాచకం తప్ప, తక్కినవన్నీ ఇంగ్లీషులో నేర్పేవారు. 1881 నాటికి చదువులో బాగా వృద్ధిలో వున్న లక్ష్మీనరసింహం ఆక్లాసుకు మానీటరుగా వున్నాడు. పరీక్షాధికారిగా వచ్చిన అలెగ్జాండరు మన్రో లక్ష్మీనరసింహాన్ని పరీక్షించి, ఇంగ్లీషు నిఘంటువును బహుమతిగా యిచ్చాడు. 1881 డిశంబరులో దొరతనము వారు పెట్టిన కంపేరిటివ్ ఎగ్జామినేషన్‌లో లక్ష్మీనరసింహం మొదటి తరగతిలో కృతార్థుడయ్యాడు.

వీరవాసరంలో చదువు 1881 లో పూర్తయింది. లోవరు ఫోర్తు, పై తరగతి చదవాలంటే నరసాపురం వెళ్ళాలి. నరసాపుర విద్యాభ్యాసం లక్ష్మీనరసింహం విద్యార్థి దశలో ప్రత్యేకమైంది.

లక్ష్మీనరసింహాన్ని, తండ్రి వెంకన్నగారు నరసాపురంలో వున్న తటవర్తి శేషమ్మగారి

పూటకూళ్ళ యింట్లో ప్రవేశపెట్టాడు. రోజుకు మూడుపూటల భోజనం పెట్టేందుకు మూడు రూపాయలు నెలకు తీసుకొనేటట్లు తటవర్తి శేషమ్మ ఒప్పుకుంది.

నరసాపురంలో టెయిలరు హైస్కూలు, మిషను హైస్కూలు వున్నాయి. మిషనువారి పాఠశాలలో జీతాలు తక్కువ. లక్ష్మీనరసింహం భాగ్యవంతుడు కాకపోబట్టి మిషనువారి పాఠశాలలో చేరాడు. జీతము నెలకి పది అణాలు. కొంతకాలమయ్యాక తల్లి, చెల్లెళ్ళు అక్కడికి రావటంతో ఒక గది, సావిడి అద్దెకి తీసుకోవలసి వచ్చింది.

లక్ష్మీనరసింహం బడికి వెళ్ళగానే, చిన్నదొరగారో, పెద్దదొరగారో వచ్చి, బైబిలు గ్రంథము చదివి, దానికి వ్యాఖ్యానం చేసి, క్రైస్తవ మతాన్ని బోధించేవారు. వారానికొకసారి పెద్ద తరగతి పిల్లలు ఇంగ్లీషు బైబిలునుంచి, చిన్నతరగతి పిల్లలు తెలుగు బైబిల్ నుంచి కొన్ని పంక్తులు అప్పగించాలి.

1882 లో మిడిల్‌స్కూలు పరీక్షలప్పుడు, మధ్యాహ్నం రావలసిన లెక్కల ప్రశ్న పత్రం, సాయంత్రం అరుగంటల కొచ్చింది. కంటిచూపు సరిగాలేని లక్ష్మీనరసింహం కొవ్వొత్తి దీపంముందు పరీక్ష సరిగా రాయలేకపోయాడు. పరీక్ష తప్పుతాడనుకున్నాడు కానీ, మూడోతరగతి జాబితాలో ఫోర్టు సెంటు జార్జి గెజెట్‌లో కనిపించింది పేరు.

1883 లో ఐదవ తరగతిలో, అంటే మెట్రిక్యులేషన్‌కు కింది తరగతిలో చేరాడు లక్ష్మీనరసింహం. తల్లి వేంకటరత్నంకు అనారోగ్యకారణంగా, ఆమె, కూతురు తణుకు వెళ్ళిపోయారు. లక్ష్మీనరసింహం, వేరొక విద్యార్థితో కలిసి వంటచేసుకోవటం మొదలుపెట్టినా, అది కుదరలేదు. లక్ష్మీనరసింహం పూటకూళ్ళ యింటికి చేరాడు. అక్కడ నెలకి మూడు రూపాయలే. కానీ ఇతని దగ్గర రూపాయిన్నరే వుంది. కనక రోజుకి ఒక్కపూట మాత్రమే తిని పాఠశాల కెళ్ళేవాడు. రెండోపూట సాధారణంగా ఒక డబ్బు పెట్టి రెండు మినపగారెలు కొని తిని, కాలువకి పోయి నీళ్ళుతాగి, కడుపునింపుకొనేవాడు. సరియైన భోజనం లేక సుస్తీపడ్డాడు. పరీక్షల్లో అన్నిటిలోనూ బాగా వచ్చినా గణితము, బీజగణితములో చాలా తక్కువ మార్కులు రావటంవల్ల మెట్రిక్యులేషన్ తరగతిలో చేరలేకపోయాడు.

ఇక్కడితో లక్ష్మీనరసింహం నరసాపుర విద్యాభ్యాసం అయిపోయింది. మేనమామతో కలసి రాజమహేంద్రవరం వచ్చిన లక్ష్మీనరసింహం, 1885 లో మెట్రిక్యులేషన్‌లో చేరాడు. స్కూల్లో చేరటానికి ప్రవేశపరీక్ష రాయాలి. ఇంగ్లీషు, లెక్కల్లో మాత్రమే ఆ పరీక్ష లెక్కల్లో తక్కువ వచ్చినా, ఇంగ్లీషులో బాగా మార్కులు రాబట్టి, మెట్రిక్యులేషన్ తరగతిలో చేరగలిగాడు. సంవత్సరానికి 36 రూపాయలు జీతం. కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఉపాధ్యాయులు. తెలుగు చెప్తూ సంఘ సంస్కరణ విషయాలు ఎక్కువగా చెప్పేవారు వీరేశలింగం పంతులుగారు. సంస్కృతం వేదం వెంకటరమణ శాస్త్రిగారు చెప్పేవారు.

రాజమహేంద్రవర విద్యాభ్యాసం లక్ష్మీనరసింహం జీవితాన్ని గొప్ప మలుపు తిప్పింది.

ఆరోజుల్లో మెట్రిక్యులేషన్ పరీక్ష పాతగోదావరి జిల్లా అంతకీ రాజమహేంద్ర వరంలోనే జరిగేది. 1885లో చిలకమర్తి పరీక్షలో తప్పిపోయాడు.

1886 లో రాజమహేంద్రవర కాలేజీలో మెట్రిక్యులేషన్ తరగతి తీసేశారు కానీ టౌన్ అండ్ ఇన్నీస్‌పేట హైస్కూల్ అనే కొత్త పాఠశాలలో లక్ష్మీనరసింహం చేరాడు కానీ లెక్కలు రాకపోటం మూలంగానే ఆ సంవత్సరంకూడా పరీక్ష తప్పాడు.

1887 సంవత్సరానికి రాజకీయంగా ఒక ప్రత్యేకత వుంది విక్టోరియా రాణి ఏభై ఏళ్ళు పరిపాలన చేసిన స్వర్ణోత్సవ సంవత్సరం అది. ఆ ఉత్సవం పట్టణాలలో పల్లెల్లో కూడా జరిగింది రాజమహేంద్రవరంలో ఈ ఉత్సవం బాగా జరిగింది మెట్కాఫ్ దొర కళాశాల విద్యార్థుల్ని ప్రోత్సహించి, జయపతాకాలతో ఊరేగింపు జరిపారు. కవి సమ్మేళనలు జరిగాయి. కందుకూరి వీరేశలింగం గారు, వావిలాల వాసుదేవ శాస్త్రిగారు మొదలైనవాళ్లు పద్యాలు చదివారు. ఈ ఉత్సవం రెండుసార్లు జరిగింది రెండుసార్లు లక్ష్మీనరసింహం పద్యాలు రాసాడు మొదటిసారి పద్యాలు రాసి స్నేహితులకి వినిపించాడు కానీ సభలో చదవలేదు. రెండోసారి సభ జరిగేప్పుడు ఒక మిత్రుడు రాణీగారి మీద పద్యాలు చదవాలనుకున్నాడు. కానీ పద్యాలు రాయటం రాదు. అప్పుడు, తొమ్మిది పద్యాలు లక్ష్మీనరసింహం రాసి, ఆ స్నేహితుడి కిచ్చాడు ఆ పద్యాలు ఆ స్నేహితుడు తనపేరునే అచ్చు వేయించుకొన్నాడు ఆ పద్యాలు సభలో చదవబడ్డాయి. అయితే ఆ పద్యాలు చదువుతుంటే పేరులేకపోయినా అవి రాసింది నేనే కదా అని లక్ష్మీనరసింహము, నేను రాయకపోయినా పేరు నాదేకదా అని ఆ స్నేహితుడు సంతోషించారు. అయితే "సభాసదులా పద్యములాలకించి, రచియించిన వారెవరో తెలిసికొనలేకపోయిరి గాని, పేరు వేసికొనిన నా మిత్రుడు మాత్రము రచియించలేదని నిశ్చయించిరి" అన్నారు చిలకమర్తి (స్వీయచరిత్ర - 106).

ఆ సమయంలోనే, ప్రధమ శాస్త్రపరీక్ష విద్యార్థులచేత 'వెనీసు వర్తకుడు' (Merchant of Venice) అనే నాటకాన్ని మాసు దొర వేయించాడు ఆ నాటకంలో ఉచ్చారణ కోసం, అభినయం కోసం, రెండు నెలలుపైగా సమయం తీసుకున్నాడు ఆ దొర. ఆ నాటకాన్ని వేసినవారిలో కొందరు లక్ష్మీనరసింహం స్నేహితులు. ఆ నాటకాన్ని చూసి చాలా ఆనందపడ్డాడు లక్ష్మీనరసింహం. రాజమహేంద్రవరంలో ఇంగ్లీషు నాటకం వేయటం అదే మొదలు.

1887 సంవత్సరంలో గణితంలో బాగా కృషిచేసిన లక్ష్మీనరసింహం పరీక్షలో కృతార్థుడయ్యాడు. లక్ష్మీనరసింహంతోపాటు చదివినవారిలో ముఖ్యుడు పోలవరము జమీందారైన శ్రీ కొచ్చర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు. ఈ స్నేహం లక్ష్మీనరసింహం జీవితంలో చాలా ఏళ్ళు కొనసాగింది.

తర్వాత చిలకమర్తి రాజమహేంద్రవరంలో ప్రధమ శాస్త్ర తరగతిలో చేరాలనుకున్నాడుగానీ, దృష్టిదోషమెక్కువవడము, గణితంలో ఎక్కువ మార్కులు రాకపోవడము, ధనం లేకపోవడము వలన చదువు మానేశాడు.

రాజమహేంద్రవరంలో లక్ష్మీనరసింహం వున్న సమయంలోనే, 1888 లో రాజమహేంద్ర వరానికి ఏలూరు కంపెనీ అనే నాటక సమాజం వచ్చింది. 1881 లోనే తెలుగు దేశానికి ధార్వాడ నాటక సమాజం రావటం, మళ్ళీ

కొంతకాలమయ్యాక 1885 లో తిరిగి రావటం జరిగింది. అయితే వామనభట్ట జోషి ఆ నాటక సమాజంతో విడిపోయి మరో నాటక సమాజాన్ని ఏర్పాటుచేసి దానికి ఏలూరు కంపెనీ అని పేరు పెట్టాడు ఈ నాటకశాలలో ఆడే నాటకాలు చూడటానికి కొందరు మిత్రులు వెడుతూ లక్ష్మీనరసింహాన్ని కూడా వెంటబెట్టుకు వెళ్ళేవారు

రాజమహేంద్రవరంలోని గురువుగారైన వేదము వేంకటచలంగారు బి యల్ చదవటానికి మద్రాసు వెళతారనే వార్త విని పాత విద్యార్థులంతా కలిసి ఒక సన్మాన సభ ఏర్పాటు చేశారు అప్పుడు లక్ష్మీనరసింహం గురువుగారి మీది భక్తితో ఐదు పద్యాలు రాసి చదివారు. పద్యాలు సభలో చదవటం అదే మొదలు చాలామంది పద్యాలు బాగున్నాయని మెచ్చుకున్నారు ఆ సభకి న్యాపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షత వహించారు

చిలకమర్తి విద్యాభ్యాసంలో రాజమహేంద్రవర విద్యాభ్యాసం చాలా ప్రభావితం చేసింది పోలవరం జమీందారు, న్యాపతి సుబ్బారావు పంతులు, కందుకూరి వీరేశలింగం పంతులుగారు, మొదలైనవారంతా చిలకమర్తి వ్యక్తిత్వాన్ని రూపుదిద్దటానికి సహకరించిన వ్యక్తులని చెప్పాలి!

★ ★ ★

# నాటకాలు

తెలుగు సాహిత్యంలో నాటకకర్తగా గొప్ప స్థానాన్ని సంపాదించుకున్నవారు లక్ష్మీనరసింహం పంతులుగారు. వీరు రచించిన నాటకాలలో స్వతంత్ర నాటకాలు, అనువాద నాటకాలు చాలా వున్నాయి.

చిలకమర్తి చేత నాటకాలు రాయించిన విశిష్టమైన వ్యక్తి ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారు. చిలకమర్తి వారి చిన్నతనంలోనే నాటక రచన ప్రారంభమయింది. ఆ కాలంలో వున్న నాటకకర్త లందరికన్నా చిన్నవాడు చిలకమర్తి. కొద్దికాలంలో ఎక్కువ నాటకాలు రాసినవాడు కూడా ఈయనే. 1889–90 సంవత్సరాలలో ఎనిమిది నాటకాలు రాసారు. వీరి నాటక రచనకి మూలమైంది హిందూ నాటక సమాజం. ఇమ్మానేని హనుమంతరావుగారు అడగిటము, చిలకమర్తి రాయటము జరిగింది. ఆ నాటక సమాజం చిలకమర్తి నాటకాలను ప్రదర్శించేది. హనుమంతరావు నాయుడుగారు స్థాపించిన హిందూ నాటక సమాజ సభ్యులు వచన నాటకాలు ఆడాలనే భావం కలవారు. హనుమంతరావు గారి కోరికపై 1889 లో చిలకమర్తి కీచక వధ నాటకం రాసి యిచ్చారు. ఈ నాటకంలో హనుమంతరావు నాయుడు గారు భీముడు, టంగుటూరి ప్రకాశంగారు ద్రౌపది పాత్రలు అభినయించారు. కీచక వధ నాటకం చాలాసార్లు ప్రదర్శించారు. ఆ తర్వాత హనుమంతరావు నాయుడుగారు చిలకమర్తిని ద్రౌపదీ పరిణయం నాటకం రాసిమ్మన్నారు. అది ఐదంకాల నాటకం. హనుమంతరావు నాయుడుగారు, ప్రకాశంగారు పద్యాలు చదువలేరు కనక ఆ పాత్రలకి వచనాన్ని రాసారు చిలకమర్తి. ప్రకాశంగారు అర్జునుని పాత్ర, హనుమంతరావు నాయుడు గారు భీమునిపాత్ర వేశారు. చిలకమర్తివారి శ్రీరామ జనన నాటకంలో దశరథునిగా ప్రకాశంగారు, రావణాసురునిగా హనుమంతరావు నాయుడుగారు పాత్రలు ధరించారు.

కీచకవధ నాటకాన్ని గురించి "నా దృష్టి బాగుండుటచే నాటకము నా స్వహస్తమున వ్రాసితిని. నా దస్తూరి మట్టుకు బాగుండెడిది కాదు ఐనను గ్రంథమంతయు నేనే వ్రాసితిని" (స్వీయచరిత్ర 123) అని చిలకమర్తి చెప్పారు. ద్రౌపదీ పరిణయ నాటకం కూడా చాలావరకు స్వహస్తంతోనే రాసారు.

చిలకమర్తి రచించిన నాటకాలు చాలా వున్నా, స్వతంత్ర నాటకాలు – (1) కీచకవధ, (2) నలనాటకము, (3) శ్రీరామ జననము, (4) సీతాకళ్యాణము, (5) గయోపాఖ్యానము, (6) పారిజాతాపహరణము, (7) ప్రసన్నయాదవం, (8) భక్తప్రహ్లాద, (9) చతుర చంద్రహాసము, (10) తిలోత్తమ, (11) ద్రౌపదీ పరిణయము. ఇవికాక ఆంధ్రజ్యోతి పత్రికలో వచ్చిన బమ్మెర పోతన, అముద్రితంగా వుండిపోయిన హరిశ్చంద్ర నాటకం కూడా చెప్పుకోవాలి.

## గయోపాఖ్యానము:

చిలకమర్తి రచించిన యిన్ని నాటకాలలోనూ ఆయనను నాటకకర్తగా నిలబెట్టి, గొప్ప కీర్తి తెచ్చిపెట్టింది గయోపాఖ్యాన నాటకం ఇది హనుమంతరావు నాయుడిగారి కోరికపై 1889 అక్టోబరులో రాయటం ప్రారంభించారు. 1889 డిశంబరు 20 నాటికి నాలుగు అంకాలు రాసి నాటక సమాజాని కిచ్చారు. 1890 జనవరి నాటికి గయోపాఖ్యానంలోని ఐదవ అంకము రాసారు ఈ నాటకం రాసేప్పటికి చిలకమర్తికి 22 సంవత్సరములు రచయితగా రాజమహేంద్రవరంలో పేరు వచ్చింది ఈ నాటకం 1890 లో మొట్టమొదటిసారిగా ప్రదర్శింపబడింది. గయుడు పాత్రను హనుమంతరావుగారు, చిత్రలేఖ పాత్రను ప్రకాశంగారు ధరించారు. అర్ఘ్యం ఇస్తున్న కృష్ణుని చేతిలో ఆకాశమార్గాన వెడుతున్న గంధర్వుడైన గయుడు చేసిన నిష్ఠీవనం పడింది. దాంతో అతడెవడైనా చంపుతానని ప్రతిజ్ఞ చేసాడు కృష్ణుడు. ఈ అపరాధం తెలిసిన గియుడు అర్జునుణ్ణి శరణు వేడాడు. గయుడి విషయంగా కృష్ణార్జునుల యుద్ధం జరిగింది కృష్ణుడు అధర్మాన్ని శిక్షించేందుకు, అర్జునుడు శరణాగతుణ్ణి రక్షించేందుకు శపథాలు చేయటం జరిగింది గయోపాఖ్యానమనే కాకుండా ప్రచండ యాదవం అని కూడా దీనికి పేరుంది. కానీ గయోపాఖ్యాన మన్న పేరు బాగా ప్రసిద్ధి కెక్కింది చిలకమర్తి వారికి పేరు తెచ్చిపెట్టిన వాటిలో ముఖ్యమైంది ఈ నాటకంలోని పద్యరచన. ఆ యుగమే పద్యనాటకం యుగం కాల ప్రభావాన్ని, ప్రజల అభిరుచిని దృష్టిలో పెట్టుకు చేసిన రచన యిది సులభశైలిలో, అలతి అలతి పదాలతో, అన్వయ సారళ్యంతో వుండటమే కాక ఇందులోని భావాలు నిత్యవ్యవహారంలో ఎంతో సన్నిహితంగా వుండటంచేత జనసామాన్యాన్ని ఆకర్షించాయి. పాత్రల స్వభావాలు చిత్రీకరిస్తూ చిలకమర్తి చేసిన పద్యరచన ప్రసిద్ధిపొందింది దెప్పొళ్ళు, అధిక్షేపాలు తెలుగింటివారికి బాగా నచ్చాయి

సుభద్ర అర్జునుడి దగ్గరకొచ్చి యుద్ధం వద్దని కోరింది. దీనికి అర్జునుడు సుభద్రని నిందించి,

'మగువ మీదను పతికింత మక్కువైన
మగువ మీదను సతికింత మమతయున్న
ఉవిదకాపురం బెంత యొప్పియున్న
పుట్టినింటికి కడుగూర్చు పొలతి యెపుడు' అని ఆడవాళ్ళకి పుట్టింటి అభిమానం ఎక్కువని నిందిస్తాడు పాపం, సుభద్ర అన్నగారి దగ్గర కెళ్ళి యుద్ధం వద్దని కోరింది కృష్ణుడు సుభద్రని నిందిస్తాడు.

'సారె చీరెలు నగలును చాల గొనుచు
పుట్టినిండ్లను గుల్లలు జేసిపోయి సతులు
తుదకు మగని పక్షముచేరి ఎదురగుదురు
మగనిపై కూర్మి అధికము మగువకెపుడు' అని పుట్టింటిని గుల్లచేసినా, భర్త పక్షమే వుంటారీ ఆడవాళ్ళు అంటాడు కృష్ణుడు.

కృష్ణార్జునుల దెప్పొళ్ళు చాలానచ్చాయి తెలుగువాళ్ళకి

బావమరిది ఎంతవాడయినా బావకు లోకువే కదా! "నెలతలా రాజ నీతులు

నేర్పువారు" అని అర్జునుడు కోపంతో, నీ అన్నలాగ స్త్రీల మాటలు లెక్క పెడతానని రాయబారాని కొచ్చావు కాబోలు అని దెప్పుతాడు సుభద్రని.

కృష్ణుడు దేవకితో,

పేరు ధర్మరాజు పెను వేపవిత్తంద్రుడు
మాట తేనెతేట మనసు విషము
నేతి బీరకాయ నీ యుధిష్ఠిరశక్తి
ఎఱుకలేని వాని ఎదుట బొగడు" అంటూ పాండవులు మేనత్త కొడుకులు కారు, మేకవన్నె పులులు అంటాడు.

చిలకమర్తి పద్యాలలో లోకోక్తులు చాలా వున్నాయి "నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష" అన్నది లోకోక్తిలాగ ప్రచారం పొందింది. 'కంచె చేను మేసె కలదె దిక్కు', 'బూడిదను మంచి పన్నీరు పోసినట్లు' – ఇలా ఎన్నో వున్నాయి

చిలకమర్తి గయోపాఖ్యానంలో సీసపద్య రచన చిలకమర్తి కవితా వైభవానికి దోహదం చేసింది. అధిక్షేప సీసాలు చాలా ప్రచారంలో కొచ్చాయి.

సీ॥ అల్లుడా రమ్మని యాదరమ్మున బిల్వ
బంపు మామను బట్టి చంపగలమె
జలకేళి సవరించు జవరాండ్ర కోకల
నెత్తుక పోయి చెట్లెక్కగలమె
యిల్లిల్లు దిరిగి వ్రేపల్లెలో ముచ్చిలి
మిసిమి ముద్దలు దెచ్చి మింగగలమె
గొల్లపొట్టెల గూడి కోల సేకొని యాల
కదుపుల నేర్పుతో కాయగలమె

తలిదండ్రులు పరుల కీదలచుకన్య
బలిమిమై దెచ్చి భార్యగా బడయగలమె
దుష్టులను వంక వీరుల ద్రుంపగలమె
అనపరాధుల దండింప నరుగ గలమె.

చిలకమర్తి సీసపద్య రచనలో అధిక్షేప పద్యాలు ఎంత ప్రచారాన్ని పొందాయో స్తుతి పద్యాలు అంత ప్రచారాన్ని పొందాయి.

జయదేవ కీగర్భ జలధి కైరవ మిత్ర
జయదళత్కంజ విశాలనేత్ర
జయ మహా పాతక జంబాల మార్తాండ
జయశైల జాధవ చాపఖండ
జయనీలనీరద శ్యామలాంగ విలాస
జయమౌని హృత్కే శేశయనివాస
జయరమామానస జలజాత మదభృంగ
జయ మదాసుర చమూచయ విభంగ

చరణనిర్గత స్వర్గంగ సాధుసంగ
కరధృత రథాంగ భవతమోహర పతంగ
జయజయాండ జేంద్ర తురంగ జయము
వేల్పుగొంకల గొంక యో వెన్నదొంగ

ఇలాంటి పద్యరచన చిలకమర్తి సాహిత్యానంతటికీ మెరుగులు పెట్టింది.

చిలకమర్తి గయోపాఖ్యానం పద్యాలు ఇంటింటా వాడవాడలా గొడ్లకాపర్లు మొదలు గొప్పింటి పెద్దలవరకు రాగయుక్తంగా పాడుకోడం జరిగింది.

గయోపాఖ్యానం 1944 లో చిలకమర్తి అస్వస్థులై ఉండగా వారి బెనిఫిట్ కోసం రాజమహేంద్ర వరంలో ప్రదర్శింపబడింది. ఆ నాటకంలో కృష్ణ పాత్రగా బందా కనక లింగేశ్వరరావుగారు ధరించారు. ఆ నాటకమాడి వెయ్యినూట పదహారు రూపాయలు చిలకమర్తికి అందించగలిగారు.

1909 నాటికి గయోపాఖ్యానం పునర్ముద్రణ పొంది రమారమి లక్షాఏబది వేలు అమ్ముడుపోయినట్లు అంచనా. ఇన్ని ప్రతులు ఖర్చయినా, ఇన్ని పర్యాయాలు ప్రదర్శింపబడినా చిలకమర్తివారి కేమీ ఆర్థికలాభం చేకూరలేదని తెలుస్తుంది.

గయోపాఖ్యానం సినిమాగా తీసే భాగ్యం ఆయన జీవితకాలంలో జరక్కపోయినా, తర్వాత కృష్ణార్జున యుద్ధంగా చలనచిత్రం వెలువడింది. చిలకమర్తి గయోపాఖ్యానం తెలుగు సాహిత్యంలో గొప్ప స్థానాన్ని సంపాదించుకుంది.

పారిజాతాపహరణము:

హిందూనాటక సమాజంకోసం 1890 లో రచించిన నాటకమిది. దీనికి ప్రోత్సాహం హనుమంతరావు నాయుడుగారే. ఇది ఐదంకాల నాటకం. దీనికి మూలం నంది తిమ్మన పారిజాతాపహరణ ప్రబంధమే. సత్యభామ పాత్రని ప్రకాశంగారు, కృష్ణ పాత్రను పిళ్ళారిసెట్టి రాధాకృష్ణమ్మ నాయుడుగారు ధరించారు. ఇది పౌరాణికమైన వస్తువు వున్న నాటకమైనా చిలకమర్తి వారు సమకాలీన సామాజిక సంస్కార దృష్టిని మేళవించారు. బహు భార్యాత్వము వలన కలిగే కష్టాలు చెప్పారు. రుక్మిణీ సత్యభామలు ఈ నాటకంలో భర్తృప్రణయాన్ని కోరి, అనురాగవతులు కావటంవలన వారిద్దరి మధ్య సపత్నీ మాత్సర్యం రగులుకొనటం సహజం. ఆవేశాలు, ఆగ్రహాలు, అధిక్షేపాలు మొదలైన వాటిలో రుక్మిణీ, సత్యభామ లిద్దరూ ఒకరి కొకరు సరితూగారు. యక్షగానాల్లోని గంగాగౌరీ సంవాదంలాగ, రుక్మిణీ సత్యభామల అధిక్షేప విన్యాసం, సంభాషణ చమత్కారం పాఠకులకు రక్తి కట్టించేలా రాసారు చిలకమర్తి. ఉదాహరణకు,

**సత్యభామ:** నావంటి గయ్యాళికే నీవుకాగా వేగుచున్నావు. గురివింద గింజ తన యడుగునవున్న నలు పెరుగదట. పైకి మహా సాధువువలె గనబడుచు లోపల గుట్రలు చేయు నీవంటి దానను నేనెట్లగుదును?

**రుక్మిణి:** పిల్లి కన్నులు మూసుకొని పాలు త్రాగి తన్నెవ్వరు చూడలేదనుకొనునట. మన ఇరువురి సాధుత్వ కౌటిల్యములు నెరగని వారెవరు?

**సత్యభామ:** తన్నుతానె మెచ్చుకొన్న దన్నుకొన్నట్లే!

ఈ నాటకంలో ముగింపులో ఒక విశేషముంది ఇంద్రోపేంద్రుల మధ్య జరిగే యుద్ధం ఈ నాటకంలో పరిహరింపబడింది దీనికి బదులుగా చిత్రరధుని రాయబారం నిర్వహింపబడింది.

ఈ నాటకంలో కూడా పద్యరచనకే ప్రాధాన్యత యీయబడింది ముఖ్యంగా సీసపద్యాలు బాగా ప్రచారం పొందాయి వర్ణనాత్మకమైన, ప్రశంసాత్మకమైన, అధిక్షేపాత్మకమైన, అనునయాత్మకమైన, స్వీయ వ్యాఖ్యానోపకారాలైన ఎన్నో సీసపద్యాలు ప్రేక్షకుల్ని ఆకట్టుకున్నాయి

విశ్వపావనమైన వినువాక మెవ్వాని
యడుగుదమ్ముల బుట్టు అలరు దేనె
భువన భారము దాల్చు భోగీంద్రు డెవ్వాని
పవళించు మెత్తని పట్టు పాన్పు
అమృతంబు పొడమిన యంబోధి యెవ్వాని
రాణివాసములుండు రాచనగరు
పరమేష్ఠి యావిర్భవంబున కెవ్వాని
పొక్కిలి పొందమ్మి పురిటి యిల్లు.
ప్రామినుకు లెల్ల నెవ్వాని వరగుణాళి
వరుసగె వారమొనరించు వందిగణము
అట్టి నిను గాంచి ధన్యుడనైతి నిప్డ
డఖిల కళ్యాణ గుణసాంద్రయాదవేంద్ర.

– ఇలా చిలకమర్తి వారి పద్యరచనా ప్రత్యేకత పారిజాతాపహరణ నాటకానికి వన్నె తెచ్చింది.

## ప్రసన్న యాదవము:

1905 లో ప్రసన్న యాదవ నాటక రచన ప్రారంభించారు చిలకమర్తి. 1906 నాటికి నాటక రచన పూర్తయింది. చిలకమర్తి వారు 1906 లో మనోరమ పత్రిక ప్రకటించటం మొదలుపెట్టారు. ఆ పత్రికలో ప్రసన్న యాదవ నాటకం నెలకొక అంకము చొప్పున ప్రచురించారు. హరివంశ, భాగవతాదులలో వున్న ప్రసిద్ధమైన నరకాసుర వృత్తాంతమే ఈ నాటకవస్తువు. ఈ నాటకానికి చిలకమర్తివారు ప్రసన్న యాదవమని పేరు పెట్టినా నరకాసుర వధ అన్నదే ప్రచారంలో కొచ్చింది

ఈ నాటకం వీర రస ప్రధానమని ప్రస్తావనలో చెప్పబడింది ఈ నాటకంలో శృంగార రసపోషణం ఒక విలక్షణతని సంతరించుకొంది ఈ నాటకానికి లక్ష్యం శ్రీకృష్ణ మాహాత్మ్యాన్ని చాటటమే.

ఈ నాటకానికీ పద్యరచనే ప్రాణం. భక్తిరసపూరితమైన పద్యాలు, వాగ్వాద రూపమయిన పద్యాలు చాలా వున్నాయి.

"నీకన్నం గడు దుష్టమతియు నీకన్న బాపాత్ముడున్
నీకన్నం గఠినాత్ముడుం గుజనుడు నీకన్న దుర్మార్గుడున్
నీకన్నం బలుకాకియుం జెనటియుం నీకన్న దుశ్శీలుడున్
నీకన్నం జడుడుం గనంబడ డిలన్నిర్భాగ్యదామోదరా"

"భగవంతుడవే యైనను
భగవంతుని తాతవైన భయపడజుమ్మీ
తెగటార్చెద పగదీర్చెద
మగవాడవయేని నిలిచి మార్కొనుమనుచున్"

ఈ విధమైన అధిక్షేప పద్యరచన చాలా ప్రచారాని కొచ్చింది.

## ప్రహ్లాద చరిత్రము:

1927 లో ఈ నాటకాన్ని శ్రీ పిఠాపురం రాజావారికి అంకితం చేశారు చిలకమర్తి.

భాగవత కథే దీనికి మూలం హిరణ్యాక్షుని మరణం నుంచి మొదలై హిరణ్యకశిపుని మరణంతో నాటకం ముగిసింది. ప్రహ్లాదుని గురువు చండామార్కుల వద్ద చదివించటం, ప్రహ్లాదుని విష్ణుభక్తి, నృసింహస్వామి చేతిలో హిరణ్యకశిపుడు నీరసించటం అనే సుప్రసిద్ధ అంశాలు ఈ నాటకంలో ముఖ్యమైనవి. ఇంత లోకప్రసిద్ధమైన అంశాన్ని మళ్ళీ చిలకమర్తి ఎందుకు నాటకంగా రచించారు అనే ప్రశ్నకి సమాధానం ఆయనే చెప్పారు

ఒక్క శాకంబె గొని వండి పెక్కుమంది
వింత వింత రుచులను గల్పించునట్లు
లొక్క యితివృత్తమే గొని పెక్కుకవులు
క్రొత్త రసములు జనియింప గూర్పగలరు.

ఆరు అంకాల నాటకంలో నాలుగంకాలు వీర రస ప్రాధాన్యత కలిగినవి. చివరి రెండంకాలలో భక్తిరసం ప్రధానం.

భక్తిని వివరిస్తూ –

"జ్ఞానమునకన్న మేలైన కర్మ కన్న
సత్వరంబుగ ముక్తి దేజాలునెద్ది
దేని కీశ్వరుండధిక విధేయు, డట్టి
భక్తికి ప్రణామ మొనరింతు బరమ భక్తి"

అని ప్రశంసించారు

భక్తి పద్య రచన సందర్భంలో చాలాచోట్ల పోతనను గురువుగా గ్రహించినట్లనిపిస్తుంది.

"కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవన గుంఫిత చర్మ భస్త్రి గాక
వైకుంఠు పొగడని వక్త్రంబు వక్త్రమే
డమడమ ధ్వని తోడ ఢక్కగాగ

అనే పోతన భాగవత పద్యాన్ని తలపింపజేస్తూ,

"శ్రీహరి పాదాబ్జ సేవ చేయని మేను
మేను గాదది మేటి మ్రానుగాని
నారాయణుని స్మరణంబు సేయని వాయి
వాయిగాదది లోతుగోయి కాని"

ప్రహ్లాద చరిత్రలో పద్యం రచించారు

ఈ నాటకంలో చండామార్కుల పాఠశాల పల్లెల్లో ప్రాథమిక పాఠశాలల్నే దృష్టిలో వుంచుకొని రాశారనిపిస్తుంది. "మన గురువులిద్దరు మనసేదో వంకబెట్టి దర్భాసనపు ప్రేళ్ళతో వీపు బ్రద్దలగునట్లు చావగొట్టుటయేగాని చదువు చెప్పుటలేదు. నిలుచున్న పక్షమున నిలుచున్నావని, కూచున్న పక్షమున కూచున్నావని, అటు నిటు చూచిన పక్షమున దిక్కులు చూచుచున్నావని, మెల్లగా చదివిన అంత హీనస్వరమేమని, గట్టిగా చదివిన గాడిదలా గిరచుచున్నావని మనచేత కోదండములు చేయించి, వంగినపుడు వీపుమీద తోడి బాలుర కూర్చుండబెట్టి, ఎండలో నిలువబెట్టి, గోడకుర్చీ వేయించి, ఇంటికన్నమునకు పంపక నుపవాసములు చేయుంచి బడిపిల్లలను చిత్రవధ చేయించుచున్నారు" అని అగ్నిరోముడనే బాలకుడు చండామార్కుల పాఠశాల గురించి చెప్పాడు.

చివరలో

"సుగుణవంతుని నీవంటి సుతుని గనుట
నలుకనైనను నవెప్పుదలచు చుండ
గొనకు నీచేత ననిలోన గూలియుంట
ముక్తిగాంచును నీతండ్రి మునుల వోలె"

అంటాడు నృసింహస్వామి ప్రహ్లాదునితో. అంటే నవవిధ భక్తిమార్గాలూ మోక్షప్రదాలే అని చెప్పడం. ప్రహ్లాద చరిత్ర భక్తి నాటకంగా బాగా ప్రసిద్ధి చెందింది.

## చతుర చంద్రహాసము:

జైమిని భారతంలో చంద్రహాస వృత్తాంతం చెప్పబడింది. అశ్వమేధాశ్వం కుంతల రాజ్యంలో ప్రవేశించి అంతర్ధానమవటముతో అశ్వరక్షకుడైన అర్జునుడు ఆశ్చర్యపోతాడు. ఆకాశమార్గం నుంచి నారద మహర్షి దిగివచ్చి గుర్రపు జాడలు తెల్పి, అర్జునుని కోరికపై చంద్రహాసుని వృత్తాంతం చెప్తాడు. జైమిని భారతంలో ఈ కథ సంగ్రహంగా చెప్పబడింది. శక్తివంతమైన చంద్రహాస కథని తీసుకొని చిలకమర్తి రసవత్తరమైన నాటకంలా తీర్చిదిద్దారు. ఈ నాటకంలో చిలకమర్తి మూలంలో లేని కొన్ని కల్పనలు చేసారు.

మూలంలో మంత్రిపేరు దుష్టబుద్ధి అని వుంటే చిలకమర్తి భాగురాయణుడు అని, చంద్రహాసుని పెంపుడు తండ్రి కుళింద దేశాధిపతి అని మూలంలో వుంటే పుళింద దేశాధిపతి అని చిలకమర్తి మార్చారు.

చిలకమర్తి వారు ఈ నాటకానికి చతుర చంద్రహాసమనే పేరు పెట్టడం విశేషం. చతురుడైన చంద్రహాసుని వృత్తాంతము, చతురమైన చంద్రహాసుని వృత్తాంతమని

చెప్పకోవచ్చు. చిలకమర్తి ప్రస్తావనలో "నాటకము వలన మనవంటి విలాసవంతులకు వేడుక తీరుటయే ప్రధాన ప్రయోజనమయినను, దీనికంటె వేయి మడుంగుల ఉత్కృష్టమైన ప్రయోజనము మరొండు గలదు అది ఏదనిన, లోకులకు ధర్మము నుపదేశించుటయే" అని సూత్రధారునిచే చెప్పించాడు. కనక ఈ నాటకంలో ఉపదేశం ప్రధానంగా వుందని తెలుస్తుంది.

కుంతల రాజ్యానికి చంద్రహాసుడు చక్రవర్తి కాగలడని జ్యోతిష్యులు ప్రకటించటంతో, ఆ కుంతల రాజ్యాన్ని కోరుతున్న మంత్రి దుష్టబుద్ధి చంద్రహాసుణ్ణి చంపించాలని ప్రయత్నం చేశాడు కానీ మరణించిండనుకొన్న చంద్రహాసుడు మహావీరుడై దుష్టబుద్ధికి ప్రత్యక్షమయ్యాడు. ఈ నాటకంలో ప్రతినాయకుడు దుష్టబుద్ధి అయిన భాగురాయుడు. ఇతడు ఎన్నోవిధాల చంద్రహాసుని మరణానికి కుట్రలు పన్నినా, చివరికి చేసిన పాపాలకు ప్రతిఫలంగా ఆత్మహత్యకు గురి అయ్యాడు. అతని కుమారుడు మదనుడూ మరణించాడు

ఈ నాటకాన్ని చిలకమర్తి విషాదాంత నాటకంగా మలచారు. పాశ్చాత్య నాటక మర్యాదను చతుర చంద్రహాసంలో తీసుకొచ్చారు. పాశ్చాత్య రూపకానువాదాలు ఆ కాలంలో చాలా వచ్చాయి. విషాదాంత నాటకాలలో విధిపాత్ర ముఖ్యమైందిగా వుంటుంది అయితే ఆ విషాదాన్ని పరోక్షంగా చూపారు

"కనులంజూడక యున్న నెవ్వని శుభాకారంబు, నెవ్వాని మేన్
మనకేలన్ స్పృశియింపకున్న, వినకున్న న్వీనులం బోల్చి యె
వ్వనికంఠధ్వని, విశ్వముంగన ననిర్వాచ్యుండెవండున్నవా
డని తోచున్మది దానికిం దొరకడెవ్వండా వేల్పు మిమ్మేలుతన్"

అని "కనులంజూడక యున్న" శుభాకారాన్ని విధిగా చెప్పారు చిలకమర్తి

దైవబలమే బలము, మానవబలం నిష్ఫలమని నిరూపించే తత్వం ఈ నాటకంలో ప్రధానంగా కనిపిస్తుంది.

చంద్రహాసమంటే ఖడ్గం అని అర్థం కూడా ఉంది. చిలకమర్తి నాంది పద్యంలో–

"విబుధ కోటికి విజ్ఞేయ విషయ మగుచు
నమిత మోహాలతాచంద్రహాసమగుచు
భువననిర్మితి నిర్దుష్ట బుద్ధి యగుచు
గాలునా వరవస్తువు కాచుమమ్ము"

అని మోహాలతా చంద్రహాసము, జ్ఞేయమైన పరమ జ్ఞానం, నిర్దుష్టబుద్ధి అన్న పదప్రయోగంచేత దుష్టబుద్ధి మరణాన్ని, దీనివలన కలిగే నీతిని విపులంగా వివరించారు.

"స్వామి ద్రోహములో దలంచుకొని యీర్ష్యాదుర్గ్రహా విష్టుడై
సేమం చేయయు లేక కోరికలకు, న్నింద్య క్రియారంభుడై
వ్యామోహంబున సాధులంజెరుపగా యత్నించు క్రూరుండెదన్
బాముల్పొందుచు దుష్టబుద్ధి పగిదిన్నాశంబు నొందుందుదిన్"

అన్నారు. అంటే ఈ నాటక ప్రయోజనం ఉపదేశమనేది స్పష్టం చతుర

చంద్రహాస నాటకం ప్రాచ్య, పాశ్చాత్య నాటక లక్షణాలతో విలసిల్లినా, పాశ్చాత్య విషాద నాటక పద్ధతిలో ముగించటం ప్రత్యేకంగా గుర్తించతగింది.

### తిలోత్తమ:

1929–30 సంవత్సరాల మధ్యకాలంలో చిలకమర్తి దీనిని రచించారు "దృశ్య ప్రబంధములో నేదో యొక యుత్కృష్టమైన నీతి వర్ణింపబడవలయునని మొదటి నుండియు నా యాశయము. ఈ యాశయము ననుసరించి ఈ కథను గ్రహించితిని" అని చిలకమర్తి చెప్పారు.

ఈ నాటక కథ మహాభారతం ఆదిపర్వంలో వుంది. మహాపరాక్రమవంతులైన రాక్షససోదరులు సుందోపసుందులు, దేవవేశ్య అయిన తిలోత్తమను చూసి పరవశులయ్యారు. సహజమయిన సోదర ప్రేమను విడనాడి, మాత్సర్యంతో ఒకరితో ఒకరు తలపడి, యుద్ధంలో ఇద్దరూ ఒకేసారి మరణించారు

ఈ నాటకంలో వచనంకన్నా పద్యం ఎక్కువ. ఈ నాటకంలో వాగ్యుద్ధాలున్నాయి. సుందోపసుందుల మధ్యే కాకుండా, వారివారి సేవకులైన శంబర, జంబుకుల మధ్యకూడా వాగ్యుద్ధాలున్నాయి. ఇవి చాలారక్తి కట్టించాయి.

ఈ నాటకంలో సాంఘిక స్థితిగతుల్ని బాగా వివరించారు. వేశ్యా లోలత్వాన్ని అరికట్టడం సాంఘిక సమస్యలో ముఖ్యమైనది. భోగము మేళాలను వ్యతిరేకించడం వుంది.

"చూడగా చూడగా నాకది భోగము దానివలె గనబడుచున్నదండీ... ఆ నక్క వినయాలు, ఆ టక్కులు, ఆ చూపులు, ఆ కోపులు, ఆ నీటులు, ఆ గోటులు చూడగా నది సంసారిలాగ కనబడలేదు."

"భూలోకంలో నున్నవారి కొంపలు కూడ దీయవలెనని."

"మొదట భోగముది. అందులో దేశద్రిమ్మరి. నోటికి ద్వారబంధములు లేవు. సిగ్గుబిడియము లంతకన్న లేవు" –

"ఈ మాయలమారి యీ అన్నదమ్ముల నిద్దరిని బుట్టలో బెట్టినది చేపలు బుట్టలో బడినవి" –

– ఈ మాటలన్నీ జంబుకుని చేత అనిపించారు చిలకమర్తి. వేశ్యా సంపర్కం ఎన్ని అనర్థాలకు దారితీస్తుందో చెప్పటానికి ఈ నాటకాన్ని రచించారు.

నిజానికి సుందోపసుందలు ఎంతో ఐకమత్యం కలవారు.

"అంగములు రెండు కాని మాకాత్మ యొకటి
యతడు నా ప్రాణ, మాతని ప్రాణ మేను
గతులు దప్ప తిరుగుగాక గ్రహచయంబు
మాకు భేదంబు గలగదు మనసులందు"

"సుందుడు చందమామ, ఉపసుందుడు వెన్నెల చిత్రవైఖరిన్
సుందుడు భాస్కరుండు, నుపసుందుడు పాయనిఛాయ నమ్ము మీ
సుందుడు వేడి వేడి నుపసుందుడు తేజము..."

అలాంటి సుందోపసుందులు తిలోత్తమ కొరకై వాదులాడుకొని మరణించటం జరిగాక, "దుర్వసనాసక్తులైన వారి గతి యింతేకదా" అంటుంది తిలోత్తమ. ఇది చిలకమర్తి నాటకంలో సూచించిన నీతి. ఈ నాటకాన్ని సుందోపసుందుల కథ అంటేనే ఎక్కువ బావుండేది.

## ద్రౌపదీ పరిణయము:

కీచకవధ నాటకాన్ని చిలకమర్తి రచించటం, దాన్ని ప్రదర్శించటం జరిగాక ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు చిలకమర్తిని మరోనాటకం రాయమని కోరారు. ద్రౌపదీ పరిణయం ఐదంకాల నాటకం. కొన్ని పద్యాలున్నా ఎక్కువగా వచన నాటకమే. ఈ నాటకం త్వరగా పూర్తికావాలని హనుమంతరావు నాయుడుగారు, దుర్గి గోపాలకృష్ణారావు గారు రాత్రులు వచ్చి, చిలకమర్తి చెప్తుంటే రాసేవారని స్వీయచరిత్రలో తెల్పారు.

ద్రౌపదీ పరిణయ నాటకం చిలకమర్తి వారి నాటకాలలో రెండవది అయినా, వారి మరణానంతరం ముద్రింపబడింది.

ఈ నాటక ప్రస్తావనలో "ఇది ప్రాతదేకాని క్రొత్తది" అంటాడు సూత్రధారుడు. అంటే చాలాసార్లు రంగస్థలంపై ప్రదర్శింపబడటంతో పాతదని, అప్పుడే ముద్రింపబడడంతో కొత్తదని అర్థం.

పాండవులు తల్లితో సహా వారణావతానికి పంపబడటం, లక్క యింటిని కాల్చి కుట్రపన్నడం, బ్రాహ్మణవేషంలో వున్న భీముడు ఏకచక్రపురంలో బకాసురుణ్ణి చంపటం, పాంచాల దేశంలో మత్స్య యంత్రాన్ని కొట్టి అర్జునుడు ద్రౌపదిని పరిణయమాడటం ఇందులో కథ.

చిలకమర్తి నాటకంలో వాగ్యుద్ధం వుంది. సంభాషణా చమత్కారం ఎక్కువ ప్రాధాన్యతను పొందింది. మత్స్య యంత్రాన్ని భేదించటానికి వచ్చిన దుర్యోధనుడు, అర్జునుడు ఒకరితో ఒకరు పోట్లాడుకోటం ఇందులో ఎంతో సహజంగా వుంది.

అర్జునుడు: ఓరీ మూర్ఖుడా, దుర్యోధనా! ఓరీ కర్ణుడా! మీరు విడుచునది మీ ప్రాణములు. అంతకంటె నేమియు గాదు.

దుర్యోధనుడు: అఖండ మహామండలాఖండలుడనైన నేనెక్కడ, పాఱుబోతవైన పాఱుడవు నీ వెక్కడ – ఛీ....!

అర్జునుడు: ఓరీ గాంధారేయాధమా! పాపా! దురాత్మా! నీ బాహుపరాక్రమమును, నీ శక్తియు, నీ మత్స్య యంత్రభేద సమయముననే యెరిగితిని.

దుర్యోధనుడు: ఓరీ మూర్ఖుడా! నీవే మెరిగితివిరా?

– ఇలాంటి సంభాషణలు ప్రేక్షకుల్ని బాగా ఆకట్టుకున్నాయి.

చిలకమర్తి ఈ నాటకంలో రచించిన పద్యాలు సాఫీగా సాగిపోయే ఆటవెలది పద్యాలు కావటం విశేషం.

ఆ॥ "మావిచిగురుకన్న మల్లెమొగ్గల కన్న
కలువరేకుకన్న గఱుకు మీరి
యింతి వాలు చూపు లెక్కుడు పనిచేయు –
జెఱుకు వింటి వాని చెయిదములకు"

ఆ॥ పాలసంద్రమందు బడబాగ్ని వడుపున
జందమామయందు కందులాగ
పరమపావన మగు భరత వంశమునందు
బుట్టరాని నీవు పుట్టినావు."

ఇతర నాటకాల్లో లాగ సీస పద్యాలు ఇందులో ఎక్కువ లేవు రెండు సీసపద్యాలు మాత్రమే వున్నాయి.

ధృతరాష్ట్రుని పాత్ర పోషణం చాలా గొప్పగా ఉంది. పాండవులను వారణావతానికి పంపేయమని దుర్యోధనుడు తండ్రిని హెచ్చరించి వెళ్ళినపుడు ధృతరాష్ట్రుడు పడిన ఆవేదనను చిలకమర్తి అద్భుతంగా చిత్రీకరించారు.

"కొడుకు నుడువులు వింటినా కులము సెడును
కులము మేలెంచు కొంటినా కొడుకు సెడును
కొడుకు కులమును జెడకుండ నడుపవలయు
లేనిచో వంశంబున కెల్ల హానిగల్గు"

– ఈ నాటకం 1889 సెప్టెంబరులోనో అక్టోబరులోనో మొదటగా రంగస్థలంపై ప్రదర్శింపబడింది.

చిలకమర్తివారు 11 నాటకాలు రచించినా ఏడు నాటకాలు మాత్రమే ప్రకటింప బడ్డాయి. కాని కీచకవధ, నల నాటకము, సీతా కళ్యాణము, శ్రీరామ జననము, ద్రౌపదీ పరిణయము అనే నాటకాలు ముద్రింపబడలేదని, అయినా వారి జీవిత కాలంలోనే ఆ నాటకాలన్నీ ప్రదర్శింపబడి ప్రజాదరణాన్ని పొందాయని తెలుస్తుంది

1881 లో ధార్వాడ నాటక సమాజం రాజమహేంద్రవరం వచ్చి నాటకశాల నిర్మించింది. ఆ నాటకసమాజం వేసే నాటకాలను చిలకమర్తి వారి స్నేహితులతో కలిసివెళ్ళి చూసేవారు. అలా నాటకాల్ని చూడటమే చిలకమర్తి చేత నాటకాలు రాయించటానికి దోహదం చేసింది. దీనికి తోడు చిలకమర్తి నాటక రచనా వికాసానికి మూలవ్యక్తి ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు. వారు స్థాపించిన హిందూ నాటక సమాజానికి పద్యాలు లేని నాటకాలు కావలసి వచ్చాయి. నాటక సమాజ సభ్యులు పద్యాలు పాడలేనివారు కావటం కారణం. మొదట రాసిన కీచకవధ నాటకంతో చిలకమర్తి నాటక కర్తగా జీవితంలో స్థిరపడే అవకాశం లభించింది. నాటకరచనలో, ఆంధ్రుల చిత్తవృత్తిని, ఆంధ్రదేశ సాంఘిక స్థితిగతుల్ని దృష్టిలో పెట్టుకుని రచన చేయటం చిలకమర్తి రచనలో ప్రత్యేకత. పద్యరచనలో ఎత్తుగడలు, సజీవ సంభాషణలు, సీసపద్య రచన, నాటకోచితమైన దృశ్య సన్నివేశాలు – ఇలాంటివెన్నో చిలకమర్తి నాటకాలు ప్రచారం పొందటానికి కారణాలైనాయి. హాస్య పాత్రల సృష్టి, లోకోక్తులు, జాతీయాలు ప్రయోగించటం, తెలుగుతనాన్ని నింపటంతో చిలకమర్తి వారి స్వతంత్ర నాటకాలు చాలా ప్రసిద్ధి పొందాయి.

# అనువాద నాటకాలు

అనువాద నాటక రచన ఆ యుగలక్షణంగా కనిపిస్తుంది. సంస్కృతంలోంచి తెలుగులోకి అనువదించిన నాటకాలు చాలా వున్నాయి. కొక్కొండ వేంకటరత్నం పంతులు, పరవస్తు రంగాచార్యులు, కందుకూరి వీరేశలింగంగారు, వావిలాల వాసుదేవశాస్త్రి, వేదం వేంకటరాయ శాస్త్రి వంటి వారెందరో అనువాద నాటక కర్తలుగా ప్రసిద్ధు లయ్యారు.

స్వతంత్ర నాటక రచయితగా ప్రసిద్ధుడైన చిలకమర్తి కూడా అనువాద నాటక విధానాన్ని చేపట్టారు సంస్కృత మహాకవి భాసుని భాసనాటక చక్రంలో పన్నెండు నాటకాలను, పార్వతీ పరిణయ నాటకాన్ని అనువదించారు.

తిరువనంతపురంలో ఆస్థానకవి, మహాపండితుడు అయిన గణపతిశాస్త్రి 1912 లో భాస నాటకాలను ప్రకటించేవరకు భాసుని గురించి అంతకు ముందు వినటమే కాని, ఎక్కువ వివరాలు ఎవరికీ తెలియవు. ఆ నాటకాలు ప్రచురింపబడగానే మానవల్లి రామకృష్ణ కవి, వేటూరి ప్రభాకర శాస్త్రి కొన్నింటిని అనువదించడం జరిగింది.

1926 నాటికి భాసనాటక చక్రంలో పన్నెండింటిని అనువదించారు చిలకమర్తి. తర్వాత 1933 లో ఆంధ్రీకరణ విషయంలో చిలకమర్తి ఒక మార్గాన్ని ఎంచుకున్నారు. "ఆంధ్రీకరణములో నేనొక క్రొత్త పుంత త్రొక్కితిని. సంస్కృత గ్రంథంలోని కొన్ని శ్లోకములు భావములు తెనిగింపబడునప్పుడు వృత్తములో నిముడక పెద్దదయిన సీసమునకు చిన్నదై యాంధ్రీకరించువానికి గొప్ప మనస్సంకటమును కల్గించు చుండును. తెనిగించువాడట్టి సమయమున సీసపద్య మెత్తుకొని భావము మొదటి నాల్గుపాదములలో ఇమిడి పోవుటచేత, ఎత్తుగీతమునకు భావ మభావమగుటచేత, అహంభావము కొంతబూని తన సొంత కవిత్వమున జెప్పియో, పదము లనవసరముగ దీర్ఘములు జేసియో, కవిత్వ కన్యను లాగిలాగి యీడ్చియీడ్చి పూర్తిచేయును. అట్టి చిక్కు నాకును సంభవించినది" అని చెప్పి (మధ్యమ వ్యాయోగము – పీఠిక, భాసనాటకములో) శ్లోకభావము పెద్దదైతే, దానిని సీస పద్యంలో యిమిడ్చి, క్రింద ఆటవెలదిగాని తేటగీతికాని చేర్చుట మానివేసారు చిలకమర్తి. అయితే, దీనివలన లక్షణమతిక్రమించినట్టుగాని, వ్యాకరణము మీరినట్టుకానీ లేదు అని చిలకమర్తి స్పష్టీకరించారు.

అనువాద విధానంలో మూలాన్ని యథాతథంగా వాడుకున్నారు. కొన్నిచోట్ల మూలానికి మెరుగులు దిద్దారు. తెలుగు నుడికారపు సొంపుతో, సరళంగా సాగింది చిలకమర్తి అనువాద విధానం. అంతేకాక, కొన్నిచోట్ల మూలానికి మార్పులు చేసారు. కొన్ని అనువదించకుండా వదిలేసారు.

"కర్ణభారం"లో "మూఢమతిమాం పరిభవతి" అని శుక్రుడు తలంచినట్లుంటే, మూఢమతి అనే పదాన్ని "కుటిల స్వభావిగా భావించి పరిభవించును" అని తెనిగించారు.

స్వప్న వాసవదత్తలో, పూలు గుచ్చటానికి పూలుచేత పట్టుకుని ఎస్తుంటే ఒక ఓషధి చేతికి తగిలింది. అది ఏమి ఓషధి అంటే, "అవిధవాకరణంనామ ఓషధి" – కాని చిలకమర్తికి అనువాదం చేసినప్పుడు "అవిధవా" అనేదే పదమైనా అందులో "విధవా" అనే మాటవుండబట్టి, అలా అనువాదం చేయటం ఇష్టంలేక దాన్ని "మంగళప్రదమైన ఓషధి" అని తెనిగించారు. అవిమారకంలో, భూతి "సర్వత్ర దాక్షిణ్యమేనకర్తవ్యమ్" అనివుంటే "ప్రతిచోటను మోమాటముండకూడదు" అని, మోమాటము అనే తెలుగుతనం ఉట్టిపడే మాట వాడారు.

ఒక శ్లోకాన్ని ఒక పద్యంలో ఇమడ్చి, మూలంలో లేకపోయినా గీతపద్యాన్ని కొన్నిసార్లు పూరించారు చిలకమర్తి. మూలంలో రెండు శ్లోకాలను ఒక సీసపద్యంగా అనువదించారు కొన్నిచోట్ల. సమానువాదమేకాక, అవసరాన్నిబట్టి ప్రౌఢానువాదం కూడా కొన్నిచోట్ల చేసారు.

ఉదాహరణకి,

"కృష్ణా పరాభవ భువారిపువాహినీచ
కుంభస్థలీదళన తీక్షణ గదాధరశ్య
భీమశ్య కోప శిఖినాయుది పార్థవ త్రీ9
చండానివైశ్చ కురువంశ వనమ్ వినష్టమ్"

అనే శ్లోకాన్ని తెలుగులో,

"ద్రుపదక్ష్మాధవ పుత్రికా పరిభవోద్భూతంబు శక్రక్ష్మా
ధిప సేనామద కుంభి కుంభ దళనోత్సేకంబు పార్థాస్త్ర శ
స్త్రప్రటిష్టానిలచోదితంబునగు దుద్యద్భీమ కోపాగ్నిచే
విపులంబౌ కురువంశకానన మికన్ వేగంబు దగ్ధంబగున్"

చిలకమర్తి ఇంత ప్రౌఢంగా అనువదించారు అనువాదంలో. స్వేచ్ఛానువాదాన్ని, సరళానువాదాన్ని అనుసరించిన అనువాద నాటకకర్త చిలకమర్తి.

★ ★ ★

# నవలలు

చిలకమర్తి నవలాకారునిగా తెలుగు సాహిత్య చరిత్రలో గొప్ప పేరు పొందారు. సాంఘిక, చారిత్రక, పౌరాణిక నవలలు చాలా రచించారు చిలకమర్తి నవలాకారునిగా స్థిరపడటానికి దోహదం చేసింది న్యాపతి సుబ్బారావు పంతులుగారు. "హనుమంతరావు నాయుడుగారి ప్రోత్సాహము లేకపోయిన యెడల నేను త్వరగ నాటకములు వ్రాయలేకపోదును. సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహము లేకపోయిన యెడల నేను నవల లప్పుడు వ్రాయలేకపోదును" అన్నారు చిలకమర్తి (స్వీయచరిత్ర–186). 1893 లో చింతామణి పత్రిక రాజమహేంద్రవరంలో మొదటిసారిగా నవల రచన పోటీ ప్రారంభించింది. న్యాపతి సుబ్బారావుగారు పాశ్చాత్య పద్ధతిలో మన భాషలో కూడ అఖ్యాయికలను (నవలలను) రాయించాలని పోటీలు పెట్టారు. వారి డబ్బుతో బహుమానాలీయ ప్రారంభించారు. అప్పటిలో నవలల్ని వచన ప్రబంధమన్నారు. చింతామణి పత్రిక నవలల పోటీలు పెట్టినప్పుడు, "తెలుగు భాష నభివృద్ధి చేయుటకు, తద్గ్రంథ కర్తలకు ప్రోత్సాహము కల్గించుటకును చింతామణి బహుమానములను రెంటిని ద్రవ్యరూపమున ఏర్పరచినారము. అందు మొదటి బహుమానము బడిసినవారికి డెబ్బదియైదు రూప్యములును రెండవ బహుమానమునకు ఏబది రూప్యములు నీయబడును. ఈ బహుమానములనంద ప్రయత్నించువారీ నిబంధనల కొడంబడి యొక వచన ప్రబంధమును వ్రాసి పంపవలెను" అని చింతామణి పత్రిక (1892–93) ప్రకటన యిచ్చింది. చింతామణి ప్రకటన చూసి ఎందరో పత్రికాధిపతులకు ఉత్తరాలు రాసారు వివరాలు తెల్పమంటూ. మార్గదర్శక సూత్రాలతో మళ్ళీ వివరణ యిచ్చింది చింతామణి పత్రిక. ప్రబంధమనగా కల్పిత కథ అని, పురాణేతిహాసాదుల నుండి, చరిత్ర నుండి కాని కథ తీసుకోవచ్చు, స్వబుద్ధి చేత నూతన కల్పనలు చేసి కూడా రాయచ్చు. వీర, శృంగార రసములు తీసుకోవాలి. ధర్మమార్గానుసారులుగా పాత్రలు తీర్చిదిద్దాలి. కథ మధ్యలో అయా పాత్రలు కొన్ని కష్టాలు పడ్డా చివరకు ధర్మము, నీతి జయించిందని చెప్పాలి. అసభ్య శృంగార వర్ణనలు చేయకూడదు. స్త్రీలు చదువకూడని మృదుత్వము తప్పిన మోటుమాటలుండకూడదు. సులభశైలి వుండాలి – ఇలా నియమ నిబంధనావళిని చింతామణి పత్రిక తెలియజేసింది.

చింతామణి నవలల పోటీలో మొదట మూడు నవలలే వచ్చాయి. మొదటి బహుమతికి డెబ్బై అయిదు, రెండో బహుమతికి యాభయి రూపాయలు ఇచ్చారు. పోటీధనం తక్కువ కాబట్టి ఎక్కువ నవలలు పోటీకి రాలేదని, మరు సంవత్సరం నవలల పోటీలో మొదటి నవలకి నూట ఇరువై ఐదు, రెండో బహుమతికి డెబ్బై ఐదురూపాయలు పెంచారు. 1894 నవలల పోటీలో పధ్నాలుగు నవలలు వచ్చాయి.

ఈ పోటీలో చిలకమర్తి వారి రామచంద్ర విజయానికి, గోటేటి కనకరాజుగారి వివేక విజయమునకు ప్రథమ బహుమతి వచ్చింది. అందుకని మొదటి రెండు బహుమతుల మొత్తం డబ్బు కలిపి, ఇద్దరికీ చెరో వంద రూపాయలు యిచ్చారు.

ఆ తర్వాత చిలకమర్తి చింతామణి నవలల పోటీలో ప్రతి ఏడూ పాల్గొని ఎన్నో బహుమతులు గెల్చుకున్నారు. అధిక సంఖ్యలో నవలలు రచించి "ఆంధ్రాస్కాట్" అనే బిరుదాన్ని కూడా పొందారు.

చిలకమర్తి వారి సాంఘిక నవలలు రామచంద్ర విజయము, గణపతి, రాజరత్నము, విజయలక్ష్మి, దుందుభి అనేవి.

చిలకమర్తి వారి మొదటి సాంఘిక నవల రామచంద్ర విజయము రచించటానికి వీరేశలింగంగారు రచించిన రాజశేఖర చరిత్ర ఆదర్శమని చిలకమర్తి చెప్పారు (స్వీయచరిత్ర–186).

ఈ నవలలో రామచంద్రుడు అనాథుడు. అతను విద్యార్జనకు, జీవితాన్ని గడపటానికి పడ్డ కష్టాలు, పొందిన అవమానాలు, చివరికి సాధించిన విజయాలు ఇందులో వివరించబడ్డాయి. ఇందులో పాత్రలు, వర్ణనలు, కథా సంవిధానం స్వాభావికంగా వున్నాయి. కోనసీమ కొబ్బరితోటలను, గోదావరీ తీరప్రాంత సీమలను చక్కగా వర్ణించారు.

నవలలో ముఖ్యపాత్ర, కథానాయకుడు రామచంద్రుడయితే, వంచకుడు, ద్రోహి శోభనాచలము. శోభనాచలమునకు రామచంద్రుని యొక్క రాగికడ్డీమీద అమర్చిన బంగారు మురుగులు, పుష్పరాగములు వేసి తీసిన తమ్మెంట్లు బాగా ఆకర్షించాయి అవి కాజేయాలనే ఆశ ఆ క్షణం నుంచి కలిగింది

రామచంద్రుడు ఉపాధ్యాయుల విశ్వనాథశాస్త్రుల వారివద్ద చదువుకొనేందు కొచ్చాడు. మోసగాడైన శోభనాచలము తను పంచకావ్యాలు చదువుకున్నానని, బ్రహ్మచారి అయినా గృహస్థునని అబద్ధం చెప్పి, తన యింటికి పిలిపించుకొని రామచంద్రుని వద్దనున్న సొమ్ము, చెవుల కమ్మలు అపహరించాడు

అమలాపురంలో ధనవంతుడు, మంచివాడయిన శరభరాజుగారు రామచంద్రుణ్ణి తనింట్లో వుండి చదువుకోమన్నాడు. రాజగోపాలమనే తన కొడుకుతో స్నేహంగా వుండమన్నాడు. ఆయన కుమార్తె పార్వతినిచ్చి రామచంద్రునికి వివాహం చేయాలని కూడా అనుకున్నాడు.

మరో అసూయాపరుడు వెంకటరత్నం వల్ల ఎన్నో కష్టాలు పడ్డాడు రామచంద్రుడు. అయినా కష్టాలనుండి గట్టెక్కి రామచంద్రుడు శరభరాజుగారి అమ్మాయి పార్వతిని పెళ్ళాడాడు చివరికి.

ఈ నవలలో పూటకూళ్ళ యిళ్ళలో జరిగే విశేషాలెన్నో చెప్పారు చిలకమర్తి. వీరేశలింగంగారి రాజశేఖర చరిత్ర తన రచనకి ఆదర్శమని చెప్పినా, చిలకమర్తి వారి నవలపై Charles Dickens రచించిన Oliver Twist నవల ప్రభావం బాగా వుంది. Oliver Twist కూడా బుద్ధిమంతుడై ఉండి ఎన్నో కష్టాలు పడ్డాడు. రామచంద్రుడు కూడా అంతే. ఈ నవలలో వీధి బడి గురించి, పంతుళ్ళ గురించి బాగా రాశారు. చిలకమర్తి నవలల్లో పాశ్చాత్య నవలాకారుల ప్రభావమున్నా తెలుగుదేశపు స్థితిగతులకు అనుకూలంగా నవలలు చిత్రీకరించటం విశేషం.

చిలకమర్తి వారి రామచంద్ర విజయము వారి తొలి సాంఘిక నవల అయినా ఎంతో ప్రచారాన్ని పొందింది.

గణపతి:

హాస్య వాఙ్మయ నిర్మాతగా చిలకమర్తి వారికి స్థానం కల్పించిన నవల 'గణపతి.' గణపతి నవలలో వస్తువు ఆంధ్ర జీవితానికి చాలా సన్నిహితమైనది. గోదావరి కృష్ణా ప్రాంతాల ఒకనాటి తెలుగు ప్రజలకు, వారి సాంఘికాచారాలకు అద్దం పట్టిందీ నవల.

"గణపతి చరిత్ర చాలా గొప్పది. ఇది చదువరుల యదృష్టము చేత మాకు లభించింది. మన పూర్వజన్మ పుణ్యము చేత లభించిన ఈ యద్భుత చరిత్రమును గణపతి ప్రతిష్ఠకు తగినట్లు రచింప లేకపోయినను, ఏదో విధముగ యథాశక్తి సహగమనము వలె రచియింపదలచుకొంటిని" అన్నారు చిలకమర్తి వ్యంగ్యంగా.

ఒక స్నేహితుడింటికి విందుకెళ్ళాడు చిలకమర్తి. విస్తళ్ళు వేయక మునుపు, విస్తళ్ళు వేశాక, వంటకాలు వచ్చేలోపల చిలకమర్తి కునుకు తీసారు ఆ నిద్రలో ఒక కల వచ్చింది. ఆ కలలో గణపతి ప్రత్యక్షమయ్యాడు. నా చరిత్రము మిక్కిలి రమణీయమైనది. ఇది మీరు తప్ప మరి ఎవ్వరు వ్రాయజాలరు అన్నాడు చిలకమర్తితో.

ఇది మూడుతరాల కథ. పప్పుభొట్ల పాపయ్య, అతని కొడుకు గంగాధరుడు, అతని కొడుకు గణపతి.

దిక్కులేని శవాన్ని కాల్చటం పుణ్యమని, అది గౌరవమైన వృత్తి అని తలచిన పాపయ్య పూనా నగరంలో ఆ పనితో ఎంతో డబ్బు గడించాడు. ఆ డబ్బు చాలా ఖర్చుచేసి అన్నప్పగారి కూతురు పిచ్చమ్మను పెళ్ళి చేసుకున్నాడు.

గంగాధరుడు పుట్టిన కొద్ది రోజులకే పాపయ్య మరణించాడు.

గంగాధరుణ్ణి చాలా కష్టపడి పెంచింది తల్లి. నీళ్ళు మోసి డబ్బు సంపాదించిన గంగాధరుడు చిత్తజల్లు సింహాచలమనే వేశ్యపైన చాలా ఖర్చుచేసేవాడు గంగాధరుడికి వివాహ ప్రయత్నాలు చేసి కోట కోనప్ప కూతురు సింగమ్మకిచ్చి పెళ్ళి చేసారు అతనికి ఏభై ఏళ్ళ వయసులో ఒక కొడుకు కల్గాడు.

"సింగమ్మకు వరప్రసాదమై పప్పుభొట్ల వంశ రత్నాకర పూర్ణచంద్రుడై యీ కథానాయకుడైన గణపతి జన్మించెను" అన్నారు చిలకమర్తి (గణపతి – 118).

గణపతి రూపం చాలా వికృతంగా వుంటుంది. గణపతి నాలుగేండ్లవాడు కాకమునుపే తండ్రి మరణించటం; గణపతి, తల్లి కలిసి, మేనమామ యింట ప్రవేశించడం జరిగింది.

గణపతికి చదువు అబ్బలేదు కానీ చీట్లాట అబ్బింది. ఈ చీట్లాట కోసం మేనమామ విభూది పెట్టెలో డబ్బులు కాజేయటం మొదలుపెట్టాడు. గణపతికి చిన్నతనంనుంచి గుర్రమెక్కాలని కోరిక. ఆ కోరిక తీరకపోవటంతో గాడిదనెక్కి ఊరంతా తిరిగాడు. గణపతికి కోటు తొడుక్కోవాలని కోరిక. "నేనేమి మునుపటి చచ్చు గణపతి ననుకొన్నావా యేమి, గిరజాలు ఎదిగిన తరువాత, కోటు కుట్టించిన తరువాత, నా దర్జా ఏమిటో మీ అందరకూ తెలియగలదు" అంటాడు తల్లితో గణపతి.

గణపతి ఉపాధ్యాయకత్వం చాలా ప్రత్యేకమైంది బడి తెరవక మునుపే కాలువ గట్టుకుపోయి మంచి ఈతబెత్తం సిద్ధం చేసుకొనేవాడు. ఉపాధ్యాయుని రూపురేఖలు చూస్తేనే బాలలకు బెదురు. పంతులు దండధరుడైనపుడు పాఠశాల యమలోకమే అంటారు చిలకమర్తి. రోజూ నాలుగైదు బెత్తాలు విరిగిపోయేవి బెత్తము దాస్తే పిల్లలు చెడిపోతారని గణపతి అభిప్రాయం. తన గురువులు తనకి విధించిన శిక్షలకన్నా ఇవి చాలా తక్కువ అంటాడు గణపతి. "ఒక పరియాయము నేను బడికి రాక యాగడము సేయ జుట్టుకు త్రాడు పోసి నూతిలో దింపారు అంతంత శిక్షలు చేసి యాయన నాలుగు ముక్కలు చెప్పబట్టి నేనింత బాగుపడి యక్కఱకు వచ్చినాను ఆ మహారాజు పెట్టిన దీపమిది. ఈ వృద్ధి అంతా ఆయనదే ఈ గ్రామము పిల్లల నందరను నాయంతటి వాళ్ళను చేయవలెనని తలంచుకోగా మీరా పని సాగనియ్యక బాధపెట్టుచున్నారు" అంటాడు విద్యార్థుల తల్లిదండ్రులతో గణపతి

ఇక గణపతి పాండిత్యం, బోధనాశక్తి తెలిసికోవలసినవే ఒక కొత్త విద్యార్థి పాఠశాలకి వచ్చాడు. గణపతి వికృత రూపము, పద్ధతి చూసి నవ్వొచ్చింది. గణపతి చేత మాట్లాడించాలనుకున్నాడు. దాశరధీ శతకంలో "శ్రీ రఘురామచారుతులసీ దళదామ శమక్షమాది శృంగార గుణాభిరామ" అనే పద్యం చదివి అర్థం చెప్పమని కోరాడు. గణపతి నిరక్షరకుక్షి, అయినా ఏదో చెప్పేయాలనే ధైర్యంతో శ్రీరాముల వారికి ఒకనాడు పైత్యముగా వుండి చారు కాపించుకున్నారు. ఆ దేశంలో కరివేపాకు లేనందున తులసి దళాలే అందులో వేసి పొంగించారు అంటూ నోటికి వచ్చినట్లు దాశరధీ శతక పద్యానికి అర్థం చెప్పాడు గణపతి.

గణపతి కొన్నిసార్లు వంట బ్రాహ్మణవృత్తితో జీవించాలని, కొన్నిసార్లు నాటకాలలో వేషాలు వేయాలని రకరకాల ప్రయత్నాలు చేసాడు.

గణపతికి భైరవ దీక్షితులుగారి అమ్మాయినిచ్చి వివాహం చేయాలనుకొన్నారు. గణపతి నలభై వారాల సొమ్ము పిల్లతండ్రి చేతిలో పోసాడు కాని ఆ భైరవ దీక్షితులు దొంగ. ఆ పిల్లని అంతకు ముందే మరోతనికి వివాహం చేసి, వాడి దగ్గరనుండి డబ్బు తీసుకున్నాడు. ఇవన్నీ బయటపడి పోలీసులు భైరవదీక్షితుల వెంటబడ్డారు. అంతేకాక కొత్త అల్లుణ్ణి, మామను అరెస్టు చేయడానికి వారంటు వచ్చింది. ఆ మాటవిన్న గణపతి దొడ్డిదారిన ఎక్కడికో పారిపోయాడు. ఇంతటితో గణపతి చరిత్ర సమాప్తమయింది.

చిలకమర్తి వారి గణపతి హాస్య సాంఘిక నవలగా కనిపించినా అది అధిక్షేపాత్మక రచన. సాంఘిక దురాచారాలన్నిటినీ విభిన్న పాత్రల ద్వారా చూపించారు చిలకమర్తి. గణపతి నవల హాస్యనవలగా తెలుగు సాహిత్యంలో చాలా ప్రచారం పొందింది.

**రాజరత్నము:**

ఒక అమాయకురాలి కథ. రాజరత్నము చక్కనిది, తెలివైంది. రామనాథ శాస్త్రి గారి సహాయంతో రామాయణ, భారత, భాగవత పద్యాలు చదివి అర్థం చెప్పగల స్థితికి వచ్చింది.

జగన్నాథరావు చక్కనివాడు. ప్రథమ శాస్త్ర పరీక్ష పాసయి రెండో తరగతిలో చేరాడు. పద్దెనిమిదేళ్ళు. రాజరత్నానికి జగన్నాథానికి వివాహం చేయటానికి ప్రయత్నాలు

జరిగినా సాంఘిక దురాచారమైన కట్నం అడ్డు తగిలి ఎన్నో కష్టాలు ఏర్పడ్డాయి. జగన్నాధరావు స్నేహితుడైన కేశవరావు చెల్లెలు రాజరత్నము. అయితే జగన్నాధరావు పెళ్ళికి అప్పు తీసుకొని, ఆ అప్పుకు తాను హామీగా వున్నాడు. కట్నం తెచ్చాడు కొడుకని జగన్నాధరావు తండ్రి శంకరరావు చాలా సంతోషించాడు. కానీ పరిస్థితులు మారాయి. అప్పు తెచ్చిన పురుషోత్తమవర్మ మరణించటంతో హామీగా నిలచిన జగన్నాధం అప్పు కట్టవలసివచ్చింది. ఈ విషయమంతా తెలిసిన శంకరరావు మండిపడ్డాడు. కొడుకు చదువుకి డబ్బు పంపటం మానేశాడు.

ఈ నవలలో ముఖ్యపాత్రల్లో ఒకటి దామోదరయ్య. వివాహ సందర్భంలో మోసగాళ్ళుగా నిలిచేవాళ్ళకి నిదర్శనం.

"దామోదరయ్య అంటే అబద్ధాల సముద్రం" "నా శక్తి మీరెరుగనిది కాదు. కోర్టులో మీరు తెచ్చిన దొంగ వ్యాజ్యములో నిచ్చిన అబద్ధ సాక్ష్యములో ఒక్కసారయినా పట్టుబడినానా? ఇన్ని తప్పుడు దస్తావేజులు మీ సెలవు ప్రకారం వ్రాసాను కాదూ! నా రాత ఒక్కసారయినా పట్టుపడినదా? సాక్ష్యమిచ్చినానంటే రాతిగోడ కట్టినట్టే!" అంటాడు. దామోదరయ్య చదివిన శ్లోకాలన్నీ తప్పులే – రాయల ఆస్థానంలో కాళిదాసు, భోజుని ఆస్థానంలో పెద్దన కలరని పక్కనా గుర్తించేవారు లేకపోటంతో చెలామణి అయిపోతోందన్నారు చిలకమర్తి – దామోదరయ్య వంటివారిని గూర్చి రాస్తూ. ఈ నవలలో నీతి చివరచెప్పి, "ఆశాపిశాచావిష్కుడు, ఒరుల కపకారము చేయదలచువాడు తప్పక తానే చెడును" అన్నారు.

## విజయలక్ష్మి:

చిలకమర్తి వారి మరో సాంఘిక నవల. ఈ నవల అసంపూర్ణం. చివర వరకు రచింపకనే చిలకమర్తి మరణించారు.

స్త్రీ విద్యను ప్రోత్సహించాలన్నది దీంట్లో విషయము.

రామేశం కూతురు విజయలక్ష్మి ఐదవ ఏట అక్షరాభ్యాసమై, రెండుపూట్ల స్కూలికి వెళ్ళేది. భాగవతంలో గజేంద్రమోక్షం, ప్రహ్లాద చరిత్ర, వామనావతార ఘట్టాలు చదివింది.

"అతి బాల్యవివాహము చేయుట నాకిష్టము లేదు. పెండ్లి ఏమో ఎరుగని అజ్ఞానదశలో బాలికలకు వివాహము చేయుట మనలో గొప్ప దురాచారమని నా అభిప్రాయము. విద్య ఎరుగని మొద్దునో, బుద్ధిలేని మూర్ఖునో, ఏ ద్విపాద పశువునో మనవారు తీరికగా కూర్చుండి, ముసలమ్మల ముచ్చట తీర్చుటకో, తమ ముచ్చట దీర్చుకొనుటకో, మొహమాటబడియో, బాలిక నెవనికో యొకనికిచ్చి పశువు మెడలో పలుపు గట్టినట్లు మంగళసూత్రమును గట్టింతురు" అంటాడు ఈ నవలలో రామేశం. చిలకమర్తి చెల్లెళ్ళ బాల్యవివాహాలపుడు ఎంతో విచారించాడు.

పెండ్లిలో భోగంమేళాలు పెట్టాలా వద్దా అనే విషయంలో, పెండ్లికొడుకైన విశ్వనాధము భోగంమేళాలు వద్దంటాడు. ఈ నవల కథ వివాహానికి ముందు జరిగే స్నాతకమహోత్సవం వరకు రచించారు చిలకమర్తి.

చిలకమర్తి వారి సాంఘిక నవలలన్నీ ఏదో ఒక నీతిని బోధించాయి. నవలను సాహిత్య ప్రక్రియగా బహుళ ప్రచారానికి తెచ్చినవారు చిలకమర్తి.

# చారిత్రక నవలలు

చింతామణి పత్రిక ప్రోత్సాహమే చారిత్రక నవలల్ని చిలకమర్తిచేత రాయించింది. 1898 లో హిందూదేశ చరిత్రాంశములతో కూడిన నవల రాయాలని ప్రకటన యిచ్చింది చింతామణి పత్రిక. చారిత్రక నవలకి కృష్ణదేవరాయల కాలము, అక్బరులోనుగాగల ఢిల్లీ చక్రవర్తులలో ఒకని కాలము, శివాజీ మొదలగు మహారాష్ట్ర ప్రభువులలో ఒకని కాలము, ప్రతాపసింగు మొదలగు రాజపుత్ర సంస్థాన ప్రభువులలో ఒకని కాలము, హైదరాలీ, టిప్పు సుల్తానుల కాలమునకు సంబంధించిన కథావస్తువు వుండాలి. సులభశైలి వుండాలి. చారిత్రక నవల రచించటానికి ముందు ఇంగ్లీషులో వున్న తార, సీత, అక్బరు, చాంద్‌బీబీ, టిప్పుసుల్తాను మొదలగు హిందూదేశానికి సంబంధించినవాటిని, స్కాట్, జూల్సువెర్న్ మొదలయినవారి రచనలు చదవటం మంచిదని తలుస్తున్నామని చింతామణి వివరణ యిచ్చింది.

ఈ ప్రకటన విని, "చారిత్రాత్మకమైన నవల వ్రాయవలెనని సంకల్పము కలుగగా అప్పుడు పూర్వము మెడోసు టెయిలరు దొరగారు వ్రాసిన నవలలలో టిప్పుసుల్తాను, తార, చాంద్‌బీబీ అను నవలలను ఒక మిత్రుడు చేత చదివించుకొని విని, చారిత్రాత్మక నవల రాసే విధం తెలుసుకున్నాను" అన్నారు చిలకమర్తి (స్వీయచరిత్ర- 258). చిలకమర్తి చారిత్రక నవలలు హేమలత, అహల్యాబాయి, కర్పూరమంజరి, మణిమంజరి, కృష్ణవేణి, సువర్ణగుప్తుడు, శాపము అనేవి.

1896 చింతామణి పోటీలలో ప్రథమ బహుమతి పొందిన చారిత్రక నవల హేమలత. ఈ కథ మేవారు రాణా లక్ష్మణ సింగు కాలంలో జరిగినట్టు చెప్పబడింది. చరిత్రాంశాలు చాలా వివరంగా తెల్పారు. ఈ నవలలో హేమలత నాయిక, మదనసింగు నాయకుడు, రహిమాను ప్రతినాయకుడు.

స్కాట్ ఆంగ్ల సాహిత్యచరిత్రలో గొప్ప నవలాకారుడు. నైసర్గిక వర్ణనలు అద్భుతంగా చేసేవాడు. చిలకమర్తి చారిత్రక నవల రచనకి ఆదర్శమయ్యాడు స్కాట్. అందుకే చిలకమర్తిని "ఆంధ్రా స్కాట్" అన్నారు. హేమలత నవలకి, మెడోస్ టెయిలరు రచించిన టిప్పుసుల్తాను నవలకి కొన్ని పోలికలు కనిపిస్తాయి.

అహల్యాబాయి:

1897 లో చింతామణి పోటీలో ప్రథమ బహుమతి పొందింది అహల్యాబాయి. "నవలలు వ్రాయుట వలన నాకు ధనలాభమే కాక సాధారణ నవలలు చారిత్రాత్మక నవలలు వ్రాయుటకు శక్తియు, నుత్సాహము కలిగెను" అన్నారు చిలకమర్తి.

అహల్యాబాయి నవలలో శామాజీ హోల్కారునకు, అహల్యాబాయికి మధ్య జరిగిన వివాదమే ముఖ్యాంశం. అహల్యాబాయికి సహాయము చేసిన శ్యామసుందర దత్తు, రాణోజీల దేశభక్తి ఇందులో వర్ణింపబడింది.

ఈ నవలలో ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు వివరింపబడ్డాయి. అహల్యాబాయి నవలకూ మెడోస్ టెయిలరు రచించిన చాంద్‌బీబీ నవలకూ కొన్ని పోలికలున్నాయి.

దౌలత్‌రావు గోమోజీ, జస్వంతరావు అహల్యాబాయిపై కుట్రలు పన్నటమూ, శ్యామసుందరరావు, రాధాకాంతరావు అహల్యాబాయికి అండగా వుండటము, చివరికి అహల్యాబాయి విజయం పొందటము అనే అంశాలతో చారిత్రక నవలగా ఇది బాగా పేరు సంపాదించుకొంది.

కర్పూరమంజరి:

1906 లో మనోరమ పత్రికలో ప్రకటింపబడిందీ నవల. కర్పూరమంజరి అనే రాజకుమారికి కలిగిన అనారోగ్యాన్ని కుదర్చటానికి ఎందరో ప్రయత్నం చేసినా, చివరకు మకరందుడు అనే రాజకుమారుడు చికిత్స చేసి, ఆమెను వివాహమాడటం ఇందులో కథ. ఇది పెద్ద నవల. మాళవ దేశంలోని ఉజ్జయినీ నగరం పాలించే సుదర్శనుని ఆస్థాన పండితుడు రుద్రభట్టు. ఈ రుద్రభట్టు పాత్ర ఈ నవలలో చాలా ముఖ్యమైంది. అన్నగారిచేత అవమానింపబడి రాజ్యంనుండి వెళ్ళగొట్టబడ్డ చిత్రభానునికి అండగా నిల్చి, హేమచంద్రుని చంపుటలోను హేమచంద్రుని భార్యాపిల్లల్ని చెరసాలలో వేయటంలోను, చిత్రభానునికి కాశ్మీర రాజ్యం కైవసం చేయటంలోను ముఖ్యపాత్ర వహించింది రుద్రభట్టే. కానీ చివరకు ఇతను విషాదపాత్రగా కనిపిస్తాడు.

మాధవసేనుడు "మహాజనులారా, ఈతడింతకన్నా దారుణమైన శిక్షల కర్హుడు. బ్రతికియుండగా వీనిం గాల్చినచో దోసములేదు. ఇట్టి కలుషాత్ముని సంపర్కము వలన అతి పవిత్రుడగు అగ్నిహోత్రుడును మలినుండగును" అంటాడు.

రుద్రభట్టు పగ చాణక్యుని పగతో పోల్చవచ్చు. ఈ నవలలో పగపట్టిన పాములాంటి రుద్రభట్టు, మహాధీరుడైన చిత్రభాను, ధర్మప్రభువైన హేమచంద్రుడు కూడా మరణించినట్టు చూపబడి, చివరకు కర్పూరమంజరీ మకరందుల వివాహం జరిపి నవలను సుఖాంతం చేసారు చిలకమర్తి

ఈ నవల చదువుతుంటే మిత్రలాభం, మిత్రభేదం చదువుతున్నట్లనిపిస్తుంది.

ఉదాహరణకు,

1 రాజా, ఈ శరీరములు నశ్వరములని యెరిగియు నీవింక విచారింపనగునె?

2. అహోహో – లోకుల యజ్ఞానమునకు మేరలేదుకదా!

3. క్రొత్తవారెవ్వరు రాలేదుకద – ఈ మనుష్యుడు మనవాడేకదా!

చిన్నయసూరి నీతికథల్లో వుండే వచనరచనా విధానం అనుసరించినట్లనిపిస్తుంది.

1. పాము విరోధము, పడగ చుట్టము నగునా? (34)
2. కొరవి చేగొని తల గొకికొనుట కాదె? (44)
3. చల్లకు వచ్చి ముంత దాచుటేల? (78)
4. తేనె పూసిన కత్తి (303)
5. పయోముఖ విషకుంభము (810)
6. ప్రక్కలో పాము (311)

ఈ నవలలో చాలా అలంకారాలున్నాయి, చాలా సంస్కృత సూక్తులున్నాయి.

1. పుత్రవిచ్ఛేత్పరాజయమ్మను నిర్వచన మొకటి గలదా? (57)
2. పరోపకారార్థ మిదం శరీరమ్మను న్యాయమునుబట్టి (65)
3. యథా రాజా తథా ప్రజా యను వాక్యము సార్థకము జేసేది (97)

చిలకమర్తి వారి నవలలన్నిటిలోను కర్పూరమంజరి అత్యుత్తమమైన నవల. పాత్ర పోషణము, వర్ణనాచమత్కృతి, కథాసంవిధానంలో ఈ నవలకి ఈ నవలే సాటి.

**మణిమంజరి:**

ఇది విక్రమాదిత్యుని కాలానికి చెందింది. దేశంలో పతివ్రతలు లేరన్నవాదం ఇద్దరు రాజుల మధ్య జరుగుతుంది. ఇద్దరూ తమ ప్రాణాలను పణంగా పెడతారు. చివరకు మణిమంజరిని పాతివ్రత్యానికి ప్రతీకగా నిల్పి లాటరాజైన మకరందుడు పందెం గెలుస్తాడు. చిలకమర్తికి స్త్రీలంటే చాలా గౌరవం. స్త్రీల శీలాన్ని శంకించేవారికి బుద్ధి చెప్పటానికి ఈ నవల రాశారనిపిస్తుంది.

విక్రమాదిత్యుడు ఉజ్జయిని పరిపాలిస్తున్న కాలంలో భూలోకంలో ఈ కాలంలో సీతా దమయంతి చంద్రమతి లోపాముద్ర అనసూయ అరుంధతి వంటి పతివ్రతలు కలరా అనే ప్రశ్న ఉదయించింది. అట్టి పతివ్రతలు లేరని, ఉండటం అసంభవమని అంటాడు చంద్రకేతుడు. పతివ్రతలు ఉన్నారంటాడు మకరందుడు.

మకరందుని భార్య పతివ్రత కాదని నిరూపించెదనని పల్కి చంద్రకేతుడు మూడు నెలలు సెలవు తీసుకొని వెళ్తాడు.

ఈ నవలలో చంద్రకేతుని వంటి దుర్మార్గులను బాగా చిత్రించారు చిలకమర్తి. మణిమంజరి వంటి పతివ్రతలను కూడ అపనిందల పాలుసేయగల దుర్మార్గులైన చంద్రకేతులాంటి వారున్నారనీ చెప్పారు ఇందులో.

విశ్వాసపాత్రురాలైన సేవకురాలిగా చంద్రముఖి, విశ్వాసఘాతకురాలిగా కళావతి పాత్రలను సృష్టించారు.

పాపములకెల్ల పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తమని చిలకమర్తి విశ్వసించినట్లు ఈ నవలలో తెలుస్తుంది. ఈ నవలలో వర్ణనలకు ఎలాంటి ప్రాధాన్యము లేదు. కథకి మాత్రమే ప్రాధాన్యమిచ్చారు చిలకమర్తి.

**కృష్ణవేణి:**

1878 లో రంగరాజను క్షత్రియుడు భార్యతో, కూతురు కృష్ణవేణితో కలిసి విజయవాడనుండి గోలకొండకి ప్రయాణమయ్యాడు. మధ్యలో బందిపోట్లు వీరిపై బడగా, రంగరాజు, భార్య కనకవల్లి కత్తిపోట్లకు గురి అయ్యారు. ఐదేళ్ళ పిల్ల కృష్ణవేణి, దాని దాసి దొంగలకు చిక్కారు.

రామరాజనే క్షత్రియ యువకుడు, వేంకటస్వామి అనే అతని సేవకుడు గోల్కొండ నుంచి కొండపల్లెకు వెడుతూ ఫూటకూళ్ళ ఇంట్లో ఆగారు.

కొండగంగులు అనే దొంగ రామరాజును గుహకు తీసుకొస్తాడు. అక్కడ కృష్ణవేణిని దాసిని చూస్తాడు రామరాజు. మూడువేల రూపాయలు తీసుకొని రామరాజును కొండగంగులు విడుస్తాడు. ఆ తర్వాత రామరాజు కొండగంగుల్ని చెరసాలలో బంధించి, కృష్ణవేణిని వివాహమాడటం ఈ నవలలోని కథ.

బందిపోటు దొంగలు, వారి ఘోర కృత్యాలను, పూటకూళ్ళు నడిపే సోదెమ్మ లాంటివారి స్వభావాన్ని బాగా వర్ణించారు. ఇందులో పూటకూళ్ళ ఇళ్ళలో జరిగే ఆచారాలు, అన్యాయాలు కూడా వివరించారు.

సువర్ణగుప్తుడు:

విక్రమార్క మహారాజు పాలించే కాలంలో జరిగిన కథ. ధనగుప్తుడి కుమారుడు సువర్ణగుప్తుడు. తండ్రి మరణించే సమయానికి పధ్నాలుగేండ్ల కుర్రవాడు. అన్న లిద్దరూ సువర్ణగుప్తుణ్ణి మోసంచేసి, ఆస్తి కాజేసి ఇంటినుంచి వెళ్లగొడతారు. తన చేతిమురుగులు అమ్మి వ్యాపారం మొదలుపెడతాడు సువర్ణగుప్తుడు. అతడు పట్టిందంతా బంగారమై ఇరవై నాల్గు సంవత్సరాలు వచ్చే సరికి పదివేల వరహాలు సంపాదిస్తాడు. సువర్ణగుప్తుడు పెద్దవాడై అన్నలపై కోపం లేకుండా కనిపెట్టి చూస్తాడు. డబ్బిచ్చి వారిని వ్యాపారం చేసుకోమంటాడు. అయినా ఆ అన్నలు ద్రోహులై సువర్ణగుప్తుణ్ణి చంపే ప్రయత్నాలు చేసి, నదిలో తోసేస్తారు. ఓ కుక్క అతణ్ణి నదిలో నీటిలోంచి బయటకి లాగి రక్షిస్తుంది. దాంతో సువర్ణగుప్తుడికి మనసు చాలా బాధపడింది. తను రక్షించిన అన్నలు తనని చంపబూనటం, ఓ కుక్క తనను రక్షించటంతో, మనుషులపైనే గౌరవం పోయింది.

అప్పటి నుండి కుక్కకి సమస్త భోగాలు కలిగించాడు. ముత్యాల కుచ్చులు గల రత్నకంబళిపై బంగారు పీటవేసి, ఆ పీట కోళ్ళకు వజ్రాలు తాపడం చేసి, పీటపై మెత్తని పట్టుపాన్పు వేసి, ఆ పాన్పుపై కుక్కనుంచేవాడు. బంగారు గిన్నెలో అన్నం పెట్టేవాడు. రెండు బోనులలో చిక్కిశల్యమయిన మనుష్యులకి బతకటానికి తగ్గ అన్నం పడేయటం జరిగింది. ఆ దృశ్యాన్ని చూసిన వేగులవాళ్ళు ఈ విషయం రాజుకి చెప్తారు. రాజు ఆశ్చర్యపోయి సువర్ణగుప్తుణ్ణి ఆస్థానానికి పిలిపించటం ఈ నవలలో అంశం.

మనుష్యుల. మనస్తత్వాన్ని బాగా చిత్రించారీ నవలలో.

శాపము:

రాజా కళింగ గంగు, వాక్శక్తి గల వేములవాడ భీమ కవిని అవమానించి, రాజ్యభ్రష్టుడయ్యాడు. అష్టకష్టాలు పడిన రాజు చివరకు భీమకవి అనుగ్రహాన్ని పొంది తిరిగి రాజ్యాన్ని పొందటంతో ఈ నవల పూర్తయింది.

ప్రజలను బాధించే ప్రభుత్వాల గురించి వివరించారు చిలకమర్తి. రాజసేవకుల దుర్మార్గాలచే ప్రజలు పడే పాట్లు, చెల్లించే పన్నులు, దోపిడీలు మొదలయినవి సహజంగా వర్ణింపబడ్డాయి. ఆంధ్రదేశ చారిత్రకాంశాలెన్నో ఈ నవలలో వున్నాయి.

సౌందర్యతిలక - పౌరాణిక నవల:

ఈ నవలలో నాలుగు కథలున్నాయి. ఒకదానితో ఒకటి అనుసంధింపబడ్డాయి. మొదటి కథ సౌందర్యతిలక కళానందుల వివాహం. రణార్ణవుడు సౌందర్యతిలకను వరించాలనుకున్నా, కృష్ణుని అనుగ్రహంవల్ల సౌందర్యతిలక కళానందుల వివాహం జరిగింది. రణార్ణవుడు ప్రతినాయకుడు.

జరాసంధుణ్ణి కృష్ణుని ప్రేరణతో భీముడు వధించటం, ధర్మరాజు నిర్వహించిన రాజసూయం నిర్విఘ్నంగా పూర్తికావటం రెండో కథ.

ఇందుమతి బాల్యంలోనే రాక్షసుడైన జ్వాలాజిహ్వుని బారిపడి అతనిచేత పెంచబడింది. కళానందుని సహాయంతో రాక్షసుడినించి బయటపడినా, శిశుపాలుని పాలబడుతుంది. కానీ చివరికి యశోధరుడనే యాదవ కుమారుణ్ణి వివాహమాడుతుంది. ఇది మూడో కథ.

ఆదర్శ గృహస్థయిన జయసేనుడు పూలచెండు నించి జారిపడిన కేతకీపత్రం వలన సంసారస్థితిలో కలత చెలరేగుతుంది. భార్యయైన తారామతిపై దురభిప్రాయ మేర్పడుతుంది. తనకు వ్యతిరేకంగా కృష్ణుని పక్కన ఇతడు ఉన్నాడనుకొని జరాసంధుడు జయసేనుణ్ణి చెరసాలలో బంధిస్తాడు. కానీ ఆ లేఖ రాసింది కళానందుడని, అది సౌందర్యతిలక నుద్దేశించి రాసిన లేఖ అని, అది సేవకురాలి పొరబాటు వల్ల తారామతి వద్దకు చేరిందని తెలియటంతో, జయసేన, తారామతుల సంసారం కుదుటపడుతుంది. ఇది నాల్గో కథ.

పౌరాణికాంశాలను నాల్గింటిని ఈ నవలలో అమర్చారు చిలకమర్తి.

ఆ కాలంలో వున్న ఆచార వ్యవహారాలు, సాంఘిక స్థితిగతులు అవగాహన చేసుకొని, ఎక్కువగా చారిత్రక నవలలు రచించిన చిలకమర్తి ఆంధ్రా స్కాట్ అనే బిరుదాన్ని అందుకే పొందారు.

## అనువాద నవలలు

అనువాద రచన ఆ కాలంలో చాలా సామాన్యం. రమేశచంద్రదత్ ఆంగ్లంలో రచించిన "The Lake of Palms" అనే నవలను సుధాశరశ్చంద్రమనే పేరున చిలకమర్తి అనువదించారు. ఇంగ్లీషులో వున్న ఆ గ్రంథాన్ని చదివించుకొని విన్నారు. రమేశచంద్రదత్ బరోడా సంస్థానంలో రెవెన్యూమంత్రిగా వుండేవాడు. ఆయన అంగీకారం తెల్పటంతో రసవత్తరమైన నవల అని తలచి చిలకమర్తి అనువదించారు. The Lake of Palms అంటే తాళ్ళచెరువు అని అనువదిస్తే బాగున్నా, ఆ నవలలోని నాయికానాయకుల పేర్లను నవలకి ఉంచితే బాగుంటుందని అనుకున్నారు చిలకమర్తి. దాన్ని మద్రాసు విశ్వవిద్యాలయం ప్రథమ శాస్త్ర పరీక్షకు పఠనీయ గ్రంథంగా ఏర్పాటు చేశారు. (స్వీయచరిత్ర- 427)

ఈ నవల బెంగాలు దేశ ఆచార వ్యవహారాలకు అద్దంలాంటిది. హరిదాసు కుమార్తె సుధ, పేదరికం వల్ల ఎన్నో కష్టాలు పడింది. హరిదాసు మరణించాక అతని భార్య బిందు, సుధలు దూరపు చుట్టమైన తరుణీమల్లిక ఇంట్లో రెక్కల కష్టంతో జీవించేవారు. అయితే సుధ చరిత్ర దయనీయంగా మారింది. పదోయేట వధువై, పన్నెండో ఏట విధవైంది. అయితే స్నేహితుడైన శరశ్చంద్రుని ప్రేరణవల్ల బిందు, సుధ, హేమచంద్రుడు కలకత్తాకు బయల్దేరి వెళ్ళారు. కొంతకాలానికి సుధాశరశ్చంద్రులు ఒకరి నొకరు ప్రేమించుకోవటం, వివాహం చేసుకోవటం జరిగింది.

ఈ నవలలో చిలకమర్తి బెంగాలీ ఆచార వ్యవహారాలను తెలియజేస్తూ, సంఘ సంస్కరణ దృష్టిని వదలలేదు. సాంఘిక సంస్కారాలలో ముఖ్యమైన స్త్రీవిద్య, స్త్రీ పునర్వివాహం ప్రచారం కోసమే ఈ నవలానువాదం చేపట్టారు చిలకమర్తి.

## దాసీకన్య:

రమేశ్‌చంద్రదత్ రచించిన "The Slave Girl of Agra" అనే ఇంగ్లీషు నవలకి అనువాదం దాసీకన్య. ఇందులో ఢిల్లీ చక్రవర్తి అక్బరు పాదుషా కాలపు కథ వర్ణింపబడటం చేత, ఢిల్లీ దర్బారు వైభవం, అంతఃపుర విశేషాలు, మొగలాయిల వేషభాషలు ఎంతో వివరంగా తెలుస్తాయి. ఢిల్లీ పాదుషా అంతఃపుర దాసీలలో ఒకతె అయిన తార్తార దేశపు స్త్రీ జులేఖా అనే దాసీకన్య చేసిన కుట్రలు, ఆమె విలాసాలు ఈ నవలలో వర్ణింపబడ్డాయి. ఈ నవలలో అక్బరు పెద్దకుమారుడైన జహంగీరు, అతను వలచిన నూర్జహాన్ నాయికా నాయకులు.

ఈ నవల చిలకమర్తి షష్టిపూర్తి తర్వాత రచించారు.

చిలకమర్తికి బెంగాలు దేశీయులన్నా, వారి సాహిత్యమన్నా, ఆచారవ్యవహారాలన్నా చాలా యిష్టం. బెంగాలు విభజన సందర్భంగా దేశీయులంతా బెంగాలు ప్రజలపై సానుభూతి చూపుతున్నప్పుడు, బిపిన్ చంద్రపాల్ రాజమహేంద్రవరం వచ్చినప్పుడు, ఆయన ఉపన్యాసాలు తెలుగులోకి అనువదించింది చిలకమర్తివారే!

## శ్యామల:

ఇది అనువాదంకాదు, అనుసరణ నవల. షేక్స్పియర్ రచించిన 'మేక్‌బెత్' నాటకానికి అనుసరణగా రచించిన నవల యిది. నిద్రుబోలు రాజ్యాన్ని పొందుతావని ఒక సన్యాసి చెప్పిన మాటవిని విజయరాయుడనే సైన్యాధికారి రాజును చంపుతాడు. అయితే అతనే పట్టుబడి చివరకు మరణిస్తాడు.

స్కాట్‌లాండ్ రాజైన డంకన్ ప్రభువును చంపడానికి ప్రయత్నాలు చేసి చివరికి రాజును చంపుతాడు మేక్‌బెత్. ఈ రాజ్యకాంక్ష అతనికి కలిగించబట్టే ఈ హత్య చేస్తాడు. చివరకు అతనూ చంపబడతాడు. ఆ ఆధారం తీసుకొని అదే అనుసరణగా రచించిన నవల శ్యామల.

చిలకమర్తివారి అన్ని నవలల్నీ పరిశీలిస్తే వారి స్వీయానుభవాలు ఎన్నో ఈ నవలలలో చోటు చేసుకున్నాయి. పూటకూళ్ళ యింటి భోజనానికుండి విద్యార్థి దశలో చిలకమర్తి బాధపడ్డాడు. చెల్లెలికి బాల్యవివాహం చేస్తే బాధపడ్డాడు. ఆనాటి సమాజంలో తను ఎదుర్కొన్న, చూసిన స్థితిగతులెన్నో ఈ నవలల్లో ప్రతిబింబించాయి. చిలకమర్తి తెలుగు సాహిత్యంలో గొప్ప నవలాకారుడు.

★ ★ ★

# ప్రహసనాలు

తెలుగు సాహిత్యంలో ప్రహసనం – ఆధునిక యుగంలో విరివిగా పండిన పంట. ఈ ప్రక్రియకి కందుకూరి వీరేశలింగం గారు నాంది ఆలపిస్తే, చిలకమర్తి ప్రస్తావన నిర్వహించారని చెప్పాలి. ప్రహసనం ఈ యుగంలో కేవలం నవ్వు పుట్టించడానికే పుట్టలేదు, సాంఘిక వ్యవస్థలోని వికృతిని ప్రదర్శించటానికి ఆవిర్భవించింది వినోదంతోపాటు వివేకం కలగాలని సాహిత్యకారులు ఈ ప్రక్రియ చేపట్టారు.

పరిహాస ప్రధానమైన అభిభాషణము అధికంగా గలది ప్రహసనమని భారతీయ నాట్యశాస్త్రంలో నిర్వచింపబడింది. ఈ హాస్యం వికృతమైన ఆకారం ద్వారాగానీ, చేష్టల ద్వారాగానీ, వేషం ద్వారాగానీ కలగవచ్చు.

ప్రహసనకర్త కేవలం హాస్య వాఙ్మయనిర్మాతగా కాక, నీతిబోధకునిగా ఎక్కువగా భాసిస్తాడు.

సమకాలీన సమాజంలోని వివిధ పాత్రలనూ, ప్రవృత్తులనూ, భాషావిశేషాలనూ, సంభాషణా చమత్కారాన్ని శబ్దాశ్రిత, అర్థాశ్రిత, భావాశ్రిత హాస్యం ద్వారా ఎన్నోవిధాల చిలకమర్తి సృష్టికరించారు.

చిలకమర్తివారి ప్రహసనాలు రెండువిధాలు – హాస్యప్రధానాలు, విమర్శనాత్మకాలు.

హాస్యప్రహసనాలలో బధిర చతుష్టయము, గయ్యాళి గంగమ్మ, జనాభా నాటకము, అద్భుత కవిత్వము మొదలైనవి ముఖ్యమైనవి.

ఒకరి మాటలు ఒకరికి వినబడకపోవటంవల్ల హాస్యం జనిస్తుంది బధిర చతుష్టయ ప్రహసనంలో.

“కడియాలవారింటికి భోజనానికి వస్తారా” అంటుంది భార్య.

“కడియాలు చేయించాలా నీకు” అంటాడు భర్త.

“కడియాలు కాదు అందెలు చేయిస్తాను” అంటాడు అందెలు అనే మాటవిని “అందాలా, ముసలిదానికి అందాలెందుకు” అంటుంది. ఇలా శబ్దాశ్రయ హాస్యంతో వున్నాయి ఈ హాస్యప్రధాన ప్రహసనాలు.

“జనాభా” నాటకంలో నాందీ, ప్రస్తావనలు, విష్కంభం ప్రవేశపెట్టారు చిలకమర్తి. జనాభాలెక్కల కోసం ఇంటింటా తిరిగే ఎన్యూమరేటరు ఒక ఇంట్లో బొట్టులేని ఆడపిల్లను భర్తపేరు అడిగితే, పక్కనున్న ముసలమ్మ ఆమె విధవ అని చెప్తుంది. ఆ ఇంట్లోనే మరో స్త్రీ స్నానం చేసి వస్తుంది. ఆమె ముఖాన బొట్టు లేకపోవటం చూసి “ఈమే విధవేనా” అంటాడు రహీమ్ అనే ఎన్యూమరేటరు.

ఆ తర్వాత ఒకతని పేరు రమణయ్య అంటే మరణయ్య అని రాస్తాడు. “నా పేరు రత్తమ్మ” అంటే, రహిమాన్ నవ్వి “రక్తమా! అరే, రక్తం పేరు ఎవరూ

పెట్టుకోరోయి – ఎంత కాఫర్లోయి మీరు" అంటాడు. ఇలాంటి సంభాషణలో హాస్యమూ శబ్దాశ్రయ హాస్యమే.

అద్భుత కవిత్వ ప్రహసనంలో ప్రాచీన కవిత్వం పాషాణమని, నవీన కవిత్వం గొప్పని నమ్మే ఇద్దరు, గురువుగారి దగ్గరకొస్తారు. వాళ్ళు రాసుకొచ్చిన పద్యాన్ని వినిపిస్తారు.

తోటకూర తెచ్చి దొడ్డిలోన తరిగి
కుండలోన పెట్టి కుదుమగాను
క్రింద మంట పెట్టి ఉడకకేం జేస్తుంది
దాని కడుపు కాల ధరణిలోన" – ఈ పద్యం విని గురువుగారు నవ్వితే వీళ్ళకి కోపం వచ్చింది. "మీ భారతాల్ గీరతాల్, ప్రబంధాల్ గిబంధాల్ అన్నీ కూడ దీపావళామావాస్యకి తూటాల్, మతాబాల్ పువ్వొత్తుల్, పేకజువ్వల్ కట్టిస్తా" మంటారు.

ఇలాంటి వెన్నో శబ్దాన్ని ఆశ్రయించి హాస్యాన్ని కలిగించే ప్రహసనాలు చిలకమర్తి రచించారు. విమర్శనాత్మక ప్రహసనాలు తనచుట్టూ వున్న సంఘాన్ని దృష్టిలో వుంచుకొని రాసినవే. వివాహ సంబంధమైనవి, వృత్తి సంబంధమైనవి, అధిక్షేపాత్మకమైనవి – చాలా ప్రహసనాల లక్ష్యం విమర్శే.

వరదక్షిణ ప్రహసనం చాలా కటువైన విమర్శతో కూడింది. రాఘవరావు కొడుక్కి సంబంధాలు చూస్తున్నాడు. అందంగా వున్న పిల్లని, సంగీతం పాడే పిల్లని, చదువుకొన్న పిల్లని కాదని క్షయరోగియైన పిల్లని కొడుక్కి కుదురుస్తాడు. రాఘవరావు మాట గ్రహించి పురోహితుడైన పెళ్ళిళ్ళ పేరయ్య "మీరు చెప్పింది చాలా బాగుంది. ఇది తోలు వ్యాపారం లాంటిది. చచ్చిన జంతువుల తోళ్ళతో వ్యాపారం చేసేవాళ్ళు కొందరు, బతికిన తోళ్ళతో వ్యాపారం చేసేవాళ్ళు కొందరు" అంటాడు.

వరకట్నం చెల్లించలేక బాధలు పడే మధ్యతరగతి కుటుంబాల నెన్నింటినో చూపారు చిలకమర్తి. ఈ ప్రహసనంలో హాస్యం లేదు. కేవలం సంఘ సంస్కరణ దృష్టి మాత్రమే

కొండూరి జానకి రామయ్యగారి పెండ్లి ప్రహసనంలో అరవై ఐదేళ్ళ జానకి రామయ్య పదిహేనేళ్ళు తగ్గించి జాతకం రాయించి కన్యాశుల్కమిచ్చి పదేళ్ళ పిల్లను పెళ్ళి చేసుకుంటాడు. సిద్ధాంతి పిల్ల తండ్రితో "నేను అమంగళము పలికానని నన్ను తిట్టకు. ఈ ముండాకొడుకునకు అతిమూత్ర రోగమున్నది. మహా బతికితే ఐదేళ్ళు బతికేను, ఆరేళ్ళు బతికేను. ఏ రాచపుండో వేసి చస్తాడు. నీకు అమాంబాపతు పాతిక వేల రూపాయలు ఆస్తి కలుస్తుంది. ఇంతకీ, పిల్ల జాతకం గొప్పది" అంటాడు.

పెళ్ళి విశేషాలు ముచ్చటించే కామయ్య, భీమయ్య సంభాషణలో చిలకమర్తి వ్యంగ్యమంతా కుమ్మరించారు. మంగళ స్నానానికి వెళ్ళిన పెళ్ళికొడుకు నూతిదగ్గర జారిపడ్డాడట. చట్ట విరిగింది. భీమయ్య ఆయన పదికాలాలు బతకకూడదా, కడుపున పది కాయలు కాయకూడదా అంటే కామయ్య లేకపోతే వితంతు శరణాలయంలోకి వెళ్ళి ఆ పిల్ల హాయిగా మళ్ళీ పెళ్ళి చేసుకోకూడదా అంటాడు. ఇది లక్ష్మీనరసింహంగారి మాటే!

వివాహ సంబంధమైన ప్రహసనాలలో చిలకమర్తి వారి అనుభవాలు తెలుస్తాయి. చిలకమర్తి తల్లిదండ్రులు రాయప్పావధానికి సుబ్బమ్మనిచ్చి పెళ్ళి చేయాలని, రాయప్పావధాని కూతురు పళ్ళాలమ్మను చిలకమర్తి వారి బంధువైన కుటుంబరావుకిచ్చి చేయాలని కుండ మార్పిడి పెళ్ళి కుదురుస్తారు రాయప్పావధానికి భార్య పోయింది. ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. ఈ సందర్భం దృష్టిలో వుంచుకొని ప్రహసనాలు రచించటమే కాక, స్వీయచరిత్రలో, "మొదటి కళత్రము పోయినపుడు రెండవ పెళ్ళి చేసుకొనుటకు ఎంత వయస్సు గలవారైనను సందేహింపరు కదా! పిల్లనిచ్చుటకు గృహస్థు కూడ సందేహింపక, సిగ్గుపడక, ధనమున కాశపడియో, ఫిరాయింపు పెండ్లినో, బంధువుల ప్రేరణకో లొంగి తమ కూతురును ముసలి దయ్యముల కిచ్చి పెండ్లిచేసి బలియిత్తురు కదా" అన్నారు. ఈ వివాహమయ్యాక చిలకమర్తి చెల్లెలు రెండునెలలు గడవకముందే మరణించింది.

మిథ్యా గౌరవాలు, అందుకోసం మనుష్యులు పడే తాపత్రయాలను చూసి వాటిని విమర్శిస్తూ చాలా ప్రహసనాలు రాసారు చిలకమర్తి.

ఆత్మగౌరవ ప్రహసనంలో ఇంటికి విందుకు పిలిచిన పెద్దమనిషి ముందు ముసలి తల్లిదండ్రులు కనిపిస్తే అగౌరవమని భార్య చెప్తే నిజమేనని అంగీకరిస్తాడు భోగరాజు అయితే మురళీధరరావు యమునాబాయి విందుకు వచ్చాక భోగరాజు తండ్రి వచ్చి తేలు కుట్టిన వృద్ధురాలికి మందు వేయించమంటాడు. వాళ్ళు వంటవాళ్లు అని అబద్ధాలు చెప్పినా, కప్పిపుచ్చుకునేందుకు ఎన్నిమాటలు చెప్పినా, మురళీధరరావు దంపతులకు ఇందులో ఏదో అధర్మం ఉందని తెలుస్తుంది. "ఈ ఇంటి చరిత్ర అంతా ఏదో నాటకములాగ కనబడుచున్నది. డబ్బు దర్పము ఎక్కువగా ఉంది" అంటుంది యమునాబాయి భర్తతో. శ్రీవారు తెచ్చుకున్న నగల విషయం బయటపడుతుందని భయపడుతూ మాట్లాడుతుంది సుందరమ్మ... అంటే, ఆత్మగౌరవం కోసం అనవసరంగా ప్రాకులాడటం ఎంత అవివేకమో చక్కగా నిరూపించారీ ప్రహసనంలో.

స్వగౌరవ రక్షణం అనే ప్రహసనంలో అంజనేయులు అనే వ్యక్తి కూలి యిచ్చి లాంతరు మోయించుకొని భోజనానికి వెళ్ళడానికి నిశ్చయించుకుంటాడు. చాకిరేవు వెళ్ళి కూలి మాట్లాడుతాడు. ఆ కూలి సమయానికి రాకపోవటంతో విందు భోజనానికి వెళ్ళడు అంజనేయులు. మిథ్యాగౌరవాల కోసం అభాసుపాలు కావటం చూపారిందులో చిలకమర్తి.

"నేను డబ్బు కూర కొన్నాను. డబ్బు మల్లెపూలు కొన్నాను. కూలివాని చేతే తెప్పిస్తాను. కాని, నేను ముట్టుకోను కదా! ఆత్మగౌరవమంటే యిలాగే నిలబెట్టుకోవడం" అంటాడు అంజనేయులు. చాకివాడు ముందర లాంతరు పట్టుకు నడుస్తుంటే భోజనానికెళ్ళడం దర్జా అని భావం.

వృత్తిస్పర్ధలను ప్రహసనాలలో బాగా చూపించారు. మనుషుల్లో ఈర్ష్య ఎంతటి దుర్నీతికి దారితీస్తుందో చూపే ప్రహసనం కనకశునక ప్రహసనం రామదీక్షితులు తనని గౌరవించటం లేదని, అతనికి బుద్ధి చెప్పాలని అనుకుంటూ వుంటాడు కామశాస్త్రి. ఓనాడు తన పిల్లవాడు కుక్కపాలు తాగాడని, దానికి ప్రాయశ్చిత్తం ఏదైనా చెప్పమని కోరాడు రామదీక్షితులు కామశాస్త్రిని. తన కసి తీర్చుకునేందుకు ఇదే సమయమని తలంచిన కామశాస్త్రి శాకటాయన శాస్త్రం ప్రకారం నాలుక

కోసేయాలని, భాండాయనుల ప్రకారం ఎర్రగా కాల్చిన యినుప ముక్కతో నాలుక కాల్చాలని చెప్తాడు. ఈ శిక్ష చాలా కఠినమైందని, మరొకటి చెప్పమని రామదీక్షితులు కామశాస్త్రిని ఎంతగానో బతిమాలుతాడు. ఆ కుక్కపాలు తాగిన పిల్లల్లో తన పిల్లాడు కూడా వున్నాడని తెలియగానే శాస్త్రార్థాలు మారుస్తాడు కామశాస్త్రి. గండాయన స్మృతిలో ఆదివారంనాడు ఎనిమిదేళ్ళ లోపు పిల్లవాడు నల్లకుక్కపాలు నాల్గు ఘడియల పొద్దువేళ తాగితే తప్పులేదని వుందని, కనక శునకదానాలు కఠినమైన శిక్షలు అక్కర్లేదని చెప్తాడు వెంటనే – అంటే శాస్త్రార్థాలను స్వార్థలాభం కోసం ఎంత తేలికగా తలక్రిందులు చేయగలరో పండితులనటానికి ఈ ప్రహసనం నిదర్శనం.

ప్లీడరు తమాషా ప్రహసనం వృత్తి స్పర్థలకు చెందింది. వృద్ధిలోకి రావాలనుకొనే ప్లీడరు ఎన్నో అవినీతి పనులు చేస్తాడు. నాగిరెడ్డి అనే కాపు రంగారావుగారిపేర రాసిన ఉత్తరం ఎడ్రసు కోసం వస్తే, అది తనకే రాసాడని అబద్ధం చెప్పి, ఆ ఉత్తరం మళ్ళా కనబడకుండా చింపేస్తాడు. కానీ ఆ పార్టీతో మాట్లాడుతూ, “తక్కిన ప్లీడర్ల లాగ మేము దగా చేసి పార్టీల సొమ్ము అపహరించము” అంటాడు. ఒక ప్లీడరు కోసం వచ్చిన వ్యక్తిని తన దగ్గరకు లాక్కోటం కోసం రాజారావు, అతని గుమాస్తా వేసిన రకరకాల ఎత్తులు చూపించారిందులో చిలకమర్తి

ఆనాటి సంఘాలలో ప్రబలిన దురాచారాలలో భోగం మేళం ముఖ్యమైనది. భోగం మేళం శుభకార్యాలలో పెట్టించటం చాలా ఘనత అనుకునేవారు. భోగం మేళాలపై ఘాటైన విమర్శతో ప్రహసనం రచించారు చిలకమర్తి.

శ్రీరామనవమి పందిరి అనే ప్రహసనంలో గంగరాజు శ్రీరామనవమి పందిరి వేయించి రామశాస్త్రి చేత రామాయణం చెప్పిస్తాడు. పందిట్లో ఎక్కువమంది లేరు. దానికి కారణమేమంటే మంగరాజు చెప్తాడు “పందిట్లో ఏం గొప్ప వుంది. అప్పో సొప్పో చేసి భోగంమేళం పెట్టించవోయి బాబూ అని నిన్ను నేను బతిమాలుకోలేదూ – వాళ్లు శోభన దేవతలు. వాళ్ళతో పందిరికి కళొస్తుంది. నీవీమధ్య ఇంగ్లీషు చదువుకున్న నిర్భాగ్యులను కొందరిని చూచి భోగము మేళము పెట్టనన్నావు. అరుణాచలం వంటి భోగంది వచ్చి మన పందిట్లో క్షణం సేపు నిల్చుంటే మహాలక్ష్మి తాండవమాడిపోదూ” అంటాడు. అంతలో గంగరాజు తమ్ముడు విరుచుకుపడిపోతాడు. అతణ్ణి శ్రీరాముడు పూనాడు. “భద్రాద్రి రాముల వారిని నాకు భోగం మేళం అక్కర్లేదటరా. మా బంటును హనుమంతుని పంపినానంటే ఈ ఊరంతా తగలేస్తాడు” – ఈ మాటల్తో గంగరాజు భయపడిపోయాడు. పైఏటికి భోగం మేళం పెట్టిస్తానని మొక్కుకుంటాడు. ఈ విధంగా భోగం మేళాలు వ్యక్తులు గౌరవాలకి మూలమని ఎలా నమ్మేవారో విమర్శించారు.

ఓట్లకు సంబంధించిన ప్రహసనాలు కొన్ని వున్నాయి. ఓట్లకై తిరుగుట అనే దాంట్లో ఓటర్లని ఎలా మోసం చేయాలో అనే విషయం వివరిస్తూ “వీళ్ళు మాయలెరుగనివాళ్ళు, మనము వీళ్ళకు మాటలు చెప్పి టోపీవేసి ఓట్లు సంపాదింపవలెను. ఈ పరియాయము నాతో మీరుండి ఒడుపులన్నీ చూచి, ఇంకొకమాటు ఎలక్షను కోసము ప్రయత్నము చెయ్యండి” అంటాడు జంబుకేశ్వరరావు చిదంబరరావుతో.

"ఎల్లక్షను చిత్రములు మిక్కిలి యద్భుతముగా నున్నది. మీరు సాక్షాత్తు కలిపురుషులంత వారండీ" అంటాడు చిదంబరరావు.

యమధర్మరాజు కచేరీ అనే మరో ప్రహసనంలో చిత్రగుప్తుడు యమధర్మరాజుకి ఓటర్ల గురించి, వీరు చేసే ప్రమాణాల గురించి చెప్తాడు. ఆ ఘోరమైన అబద్ధాలు విని యమధర్మరాజు అంటాడు –

"పాత నరకము లేవియు పనికి వచ్చునట్లుగా నాకు తోచదు. వీరికైనా క్రొత్త నరకమొకటి ప్రత్యేకముగా వీరి కేర్పరుపవలసినదని బ్రహ్మ విష్ణు మహేశ్వరులతో నేను మాట్లాడెదను" అని. ఒక ఓటరు యమధర్మరాజుతో మాట్లాడుతాడు. "నా పేరు గోపయ్య. మా వార్డు ఓటర్ల జాబితాలో పాపయ్య అనే మనిషి పేరు వోటరుగా వేయబడి యున్నది. ఒక పక్షమువారు నాకు వరాహ సొమ్మిచ్చి అవతల పక్షం తిరిగి పోకుండా రాత్రి నాలుగుజాములు నన్నొక గదిలో పెట్టి తాళము వేసి నా పేరే పాపయ్య అనిపించి, నాచేత వోటు చేయించినారు. పాపయ్య అదివరకే చచ్చిపోయి పదేళ్ళయినదట. నీపేరు గోపయ్య కాదా యని ఎవరో యొకరడుగగా నేను ఖంగారుపడక యెంతో ధైర్యముతో నేను పాపయ్యనేనని జవాబు చెప్పితిని" అంటాడు ఓటరు.

చిలకమర్తి వారి కాలంలోనే మున్సిపల్ వ్యవహారాలు ఎంతో చిత్రంగా వుండేవి. వాటిని ఎన్నో ప్రహసనాల మూలంగా వివరించారు. అందువల్ల వారి దేశమాత పత్రిక ఎన్నో చిక్కులకు గురి అయింది.

మనుష్యులలో లోభానికి ఉదాహరణగా అపూర్వ నరకప్రహసనం రచించారు. లోభి మరణ శాసనంలో రాసిన విశేషాలన్నీ చదివాడు చిత్రగుప్తుడు. ఆ మరణ శాసనం విన్నాక యమధర్మరాజుకి ఆశ్చర్యం వేసింది. ఖర్చులేని ఎన్నో విషయాలున్నాయి దానిలో. తను జాగ్రత్త చేసిన పోట్లాపునే దానమియ్యాలని, ఇలా మరెన్నో రాసిన లోభిని ఏ నరకంలో పారేయాలని ఆలోచించి, చివరికి తిరిగి కొడుకులున్న చోటికి పంపుతారు. అంటే, ఆ కొడుకులు పెట్టే డబ్బుఖర్చులు చూస్తుంటే లోభివాని మనసు నానా బాధలు పడుతుంది. అదే అతనికి సరైన నరకం అని భావం.

చిలకమర్తి రచించిన ప్రహసనాలలో ఔషధి ప్రకటనలు అనేది ఒకటి. ఏ వృత్తిలోనూ పొట్టగడవని మనుష్యుడు ఔషధ ప్రకటనల ద్వారా డబ్బు సంపాదించాలనుకుంటాడు.

**మందులు:–** జ్వరమూషిక మార్జాలము – దీనిని సేవించినవారికి సమస్తమైన రోగములు నశించును. దీని పథ్యము సులభము – అన్నము, రొట్టె, సమస్తమైన పండ్లు, పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, మీగడ, నెయ్యి, నూనె, దుంపలు, ఉప్పు, పులుపు, కారం, పచ్చళ్ళు, పిండివంటలు, కందులు, శనగలు, మినుములు, పెసలు, మంచినీళ్ళు వర్జింపవలయును. తక్కినవన్నియు పుచ్చుకొనవలయును.

**అజీర్ణము పోగొట్టే మందుల పేర్లు:–** అజీర్ణ మహాజీమూత ఝంఝామారుతము, అగ్నిమాంద్య వృశ్చిక కుక్కుటము, వాత సర్పగారుడము – ఈ మందులు పుచ్చుకొనువాని కడుపు వేసవికాలములో పగలు రెండు జాముల వేళ యిసుక తిప్పపై యెర్రరాళ్ళు ఏలాగున కాలుచుండునో ఆలాగు కాలుచుండును.

ఈ మందు తయారగుటకు వాడిన వస్తువులు యివి:– కస్తూరి, కుంకుమ పువ్వు, పచ్చకర్పూరము, పునుగు, జవ్వాజి, మొసలి చేదుకట్టు, పాము చేదుకట్టు,

జెర్రి చేదుకట్టు, నెమలి ఈకల భస్మము, పెద్దపులి పాలు జున్ను, పిల్లిపాల మీగడ, సివంగి పాలవెన్న, సింహము గుండెకాయ, ఏనుగు దంతముల చూర్ణము కలిపినవి.

ఇంకా కొన్ని మందులు:- అకాల మరణ జంబాల మార్తాండము, భేది మహా వజ్రకవాటము, సకల జాడ్య ఘాసమహిషము మొదలైనవి.

ఈ ప్రహసనాలలో శబ్దాశ్రయ హాస్యముంది. వీటిలో ఆడంబర పదప్రయోగంవల్ల హాస్యం జనిస్తోంది. అలాగే హాస్యం జనించడానికి క్లిష్ట పదప్రయోగం కూడా ఉపకరిస్తుంది. యమకంతోకాని, అనుప్రాసతో కాని శబ్దవైచిత్రిని చూపించవచ్చు.

లండను సంకల్పం అనేదాంట్లో పూర్వాచారపరాయణులు శ్రోత్రియ కర్మిష్ఠులు లండను వెడితే, థేమ్సు నదిలో స్నానమాడి సంకల్పము చెప్పుకోవచ్చునని సంకల్పసూత్రాన్ని వివరించారు.

అచమనము:- లండన్ వేస్యాహా – జాశవేస్వాహా – క్రైస్తవేస్వాహా – ఇంగ్లాండ్ – స్కాట్లండ్ – ఐర్లండ్ – తత్క్రైస్తోత్వరేణ్యం – జుహోవా దేవస్య ధీమహి – ధీయోయోనః ప్రచోదయాత్ – నామ – ఉపాత్త – ధనవ్యయద్వారా – కాంటినెంటల్ టూర్ – సంప్రాప్త్యర్థం – టేబిలూ పరహసోపానత్కావచోష్టిషాది వేషచిరప్రార్థిత భోజన మనోరథ సంపాదనార్థం – శ్రీమల్లండన్నామక మహాక్షేత్రే – అస్మిన్వర్తమానవ్యావహారిక హూణమాసేన – క్రిస్తోరనం పరం వింశతితమ శతాబ్దే – వత్సరే – మాసే – దినే – అఖండ థేమ్సునద్యాం వీరభద్రశర్మాహం జ్ఞానస్నానం కరిష్యే –

ఈ సంకల్పం వింటే నవ్వురాక తప్పదు. ఇది శబ్దాశ్రయ హాస్యము. అన్యభాషా పదప్రయోగం వల్ల సాధింపబడింది. లండను సంకల్పంలో ఇంగ్లీషు, సంస్కృత పదాల సమ్మేళనంవల్ల హాస్యం జనిస్తోంది.

చిలకమర్తి వారి ప్రహసనాలలో, ఔషధ ప్రకటనము, పెండ్లికొడుకుల ధరలు, సప్త గ్రహ కూటములు, గొప్ప వైద్యుడు, మహజరీ, ఆకాశ విశ్వవిద్యాలయము, 'పెండ్లికొడుకుల' లక్షణాలు, ధర్మపరిపాలన సభ, లండను సంకల్పము, పితృదేవతల మహజరు, చాకలి పురాణము, కలిగీత మొదలైనవి కొన్ని, ప్రహసనాలలో చేరినా పూర్తిగా ప్రహసన లక్షణాలు లేనట్టివి. ఇవి వ్యాసాలూ కావు. కనుక వ్యాసధర్మాన్ని ప్రహసన లక్షణాన్ని కలిగి, అర్థాశ్రయ, శబ్దాశ్రయ హాస్యంతో కూడివున్నవిగా గుర్తించాలి.

చిలకమర్తి ప్రహసనాలన్నీ సంఘసంస్కరణ దృష్టితో రచించినవే. నవ్వు అనేది సంఘమును వ్యక్తిని విమర్శించడాని కుపయోగించే హాస్యం. హాస్యాన్ని తన రచనలో పొందుపరిచే కవికి ప్రతిభతోపాటు, భాషలో వుండే వాడుపు, పలుకుబడి తెలిసి వుండాలి.

మనసాహిత్యంలో హాస్యరసపోషణ రాజులకాలంలో ఉదాత్త సాహితీ ప్రయోజనాన్ని ఆశించింది. సంధియుగంలో హాస్యరసపోషణ వినోదార్థం బయలుదేరింది. కందుకూరి యుగంలో హాస్యరసపోషణ సంఘసంస్కరణార్థం బయలుదేరింది.

సంఘసంస్కరణ కోసం మెత్తగా మందలిస్తూ ప్రేక్షకులకు పాఠకులకు ఆత్మావలోకనం కలిగించి ప్రహసన రూపక ప్రయోజనాన్ని చక్కగా సాధించారు చిలకమర్తి.

# కథలు

వీరేశలింగంగారు ప్రజలలో మూఢవిశ్వాసాలను పోగొట్టడానికి ఎన్నో రచనలు చేపట్టారు. వారి అనుయాయిగా చిలకమర్తి కూడా ఎన్నో రచనలు చేశారు.

తెలుగు సాహిత్యంలో 19 వ శతాబ్దంలో అత్యధికంగా ఆదరణ పొందిన ప్రక్రియ కథ. ఆంగ్ల విద్యావిధానంలో పాఠ్యపుస్తకాలలో కథలు వేయటం మొదలైంది. మొదట్లో బృహత్కథ, కథాసరిత్సాగరం, పంచతంత్రం, విక్రమార్క కథలు మొదలైనవి కథలుగా పాఠకులకు ఆసక్తి కలిగించే విధంగా వుండేవి. కథలు బహు జనాదరణ పొందటానికి సులభశైలి, సంభాషణాత్మకత ముఖ్యమైనవిగా వుండేవి.

రాజస్థాన కథావళి:

చిలకమర్తి చేపట్టిన సాహిత్య ప్రక్రియలలో కథ ఒకటి. చిలకమర్తి కథా సంపుటాలలో ఒకటి అనువాద గ్రంథం వుంది. Colonel James Tod పుస్తకాన్ని రాజస్థాన కథావళి అని అనువదించారు. The Annals and Antiquities of Rajasthan or the Central and Western Rajpoot States of India అనే పుస్తకం యిది. చిలకమర్తి వారి అనువాదం చాలా సహజంగా వుంది. రాజస్థాన కథావళిలో రాజస్థాన రాజ్యాల చరిత్రలో నున్న ముఖ్యమైన సన్నివేశాలు కొన్ని, రాజస్థాన్ రాజ్యాల నేలిన రాజుల విశేషాలు కొన్ని జతచేసి హృద్యంగా ఈ రచన సాగించారు. ఇది వీరరసపూరితమైన గ్రంథము కావటంచేత, జాతి, దేశాభిమానాలను పురికొల్పే ఘట్టాలతో నిండివుండటంచేత చాలా ఆసక్తిదాయకంగా వుంది.

రాజస్థాన కథావళిలో 24 కథలున్నాయి. అన్ని కథలు రాజస్థాన రాజవంశంలోని వ్యక్తులకు సంబంధించినవే.

బప్పారావు కథలో బప్పారావు పశుల కాపరి కాడని, రాజకుమారుడని గుర్తించి, రాజకుమార్తెనిచ్చి వివాహం చేయటం జరిగింది. బాలుడుగా ఉన్నప్పుడు బప్పారావు ఆడిన ఆట, అదే అతని వివాహామునకు మూలమైంది. బాలికలు బాలురు కలిసి బొమ్మల పెండ్లిండ్లాట ఆడటము, చివరకు ఆ ఆట నిజమైనట్లు రాజకుమార్తెను వివాహమాడటము జరగటము, అక్కడ మహిషాసుర మర్దని ప్రత్యక్షమై ఆ బాలకునికే విల్లు, అమ్ములపొది, ఖడ్గము వరంగా యివ్వటము మొదలైన విశేషాలెన్నో ఈ కథలో వున్నాయి.

రాణా సంగ్రాముడు కథలో మీరాదేవిని గూర్చిన విషయాలే. మీరా తను మహారాజు భార్యననే విషయం మరిచి సామాన్య స్త్రీలాగ కృష్ణ మందిరంలో ఆడి పాడేది. మూలాన్ని తెనిగించేప్పుడు చిలకమర్తి చాలా జాగ్రత్తగా "శ్రీకృష్ణ పరబ్రహ్మ స్వరూపమే యని సంసారపు గొడవలు వదులుకొని స్వామి గుణముల

వర్ణించి కవనము చెప్పుటయు, అనుట, పాడుటయు, నాడుటయు తప్ప తక్కిన పనుల జోలికి పోదయ్యే" అన్నారు భక్తురాలైన మీరాగూర్చి. రాణా సంగ్రాముడు దృఢ మనస్కుడు, న్యాయప్రదాత. ఒక్కొక్క గ్రామాన్నుంచి వచ్చే శిస్తు ఒక్కొక్క ఖర్చుకే వినియోగించాలన్నాడు. ఒకనాడు భోజనం చేస్తున్న రాణాకు పెరుగులో కలుపుకునేందుకు చక్కెర లేదు. పంచదార నిమిత్తం ఏర్పడిన గ్రామం దానం యిచ్చాడు కాన పంచదార లేదని చెప్పాల్సి వచ్చింది. కాగా ఆ మాటలు విని నిజమే అని చక్కెర లేకుండా భోజనం చేశాడు.

చిలకమర్తి రాజస్థాన కథావళి చాలా కాలం పాఠశాలల్లో పాఠ్యగ్రంథంగా పెట్టారు. నీతిబోధకమైన భారతీయ సంస్కృతిని బోధించే ఈ కథలు అనాడు యువకులెందరో చదివారు.

## భారత కథామంజరి:

పందొమ్మిది కథలున్నాయి. వీటన్నిటిలోనూ నీతిబోధే చిలకమర్తి లక్ష్యం. పిల్లి – ఎలుక, మూడు చేపలు, శంఖ లిఖితులు, విశ్వామిత్రుడు – మాలవాడు, కపోతము – కిరాతుడు, గ్రద్ద – నక్క, గాలి – బూరుగు చెట్టు, నాడీజంఘుని కథ, చిరకారి, మరణకారణము, సప్తమహర్షులు, వృషాదర్భి, గౌతముడు – దేవేంద్రుడు, కుక్క, పులి – నక్క, హంస – కాకి – ఇలా ఈ కథలన్నీ నీతి కథలే.

ఈ కథలన్నిటిలో ఒక్కొక్క కథకి ఒక్కొక్క నీతి చెప్పబడింది.

1. తమ కుపకారము చేసినవారికే హానిచేయదలచు దురాత్ములు చెడిపోక బాగుపడుదురా?
2. దుష్కార్యము చేయుమని తండ్రి చెప్పినను, గురువు చెప్పినను చేయగూడదని ఈ కథ ఫలితార్థము.
3. కృతఘ్నత మహాపాతకమనియు, మిత్రద్రోహమంతకంటె దారుణ పాతకమనియు నీ కథ వలన మనము తెలిసికొనవలసిన ఫలితార్థము.
4. పశ్చాత్తాప మహాగ్నిచే పరిశుద్ధుడైన కిరాతుడు ముక్తుడయ్యెను – ఇలా ఎన్నెన్నో! భారత కథామంజరిలో అన్నీ నీతి ధర్మబోధకాలైన కథలే.

## చమత్కార మంజరి:

ముఖ్యమైనవారి జీవితాల్లోని చమత్కార సన్నివేశాలు కథాంశాలుగా మలచారు చిలకమర్తి. నలభై ఎనిమిదిమంది జీవితాల్లోని విశేషాలు కథా రూపాలుగా వెలువడ్డాయి. భారవి, భర్తృహరి, వేమన, తుకారాము, విక్రమార్కుడు, రాక్ ఫెల్లర్, జనరల్ వాషింగ్ టన్, కళింగ గంగు, ఖడ్గతిక్కన, తరిగొండ వెంగమాంబ, రాయన భాస్కరుడు, రుద్రమదేవి, బమ్మెర పోతన, మంత్రి యుగంధరుడు, కోరందేవి, పోర్చుగీసు సోదరులు, అపకారికి ఉపకారము, సుమంతుడు, వేటగాడు. సోక్రటీసు – ఇలా ఎందరో వ్యక్తుల గురించి, ఎన్నో అంశాల గురించిన కథలున్నాయి.

ఈ కథల్లో విదేశీయుల కథలుండటం విశేషం. పోర్చుగ్రీసు, అమెరికా, గ్రీసు మొదలైన దేశాల్లోని వ్యక్తుల జీవిత విశేషాలు తీసుకొని చక్కని కథలల్లారు చిలకమర్తి.

చిత్రకథాగుచ్ఛము:

ఇందులో ఎనిమిది కథలున్నాయి. మైలలో పెండ్లి - పెండ్లిలో మైల, పలు గురాముడు, గోమోజీరావుపంతులు, హరిసింగు హవల్ దార్, సుదర్శనరావుపంతులు, వేంకట నారాయణగారు, పిసినిగొట్టు భీమన్న, అపూర్వ దాంపత్యం - మొదటి కథ అసూయతో వివాహాన్ని చెడగొట్టటం, రెండవది వింత వివాహం, మూడవది మహారాష్ట్రుని వింత మనస్తత్వం, హవల్దారు పదవి అయి పింఛను పుచ్చుకొని, ఐదు రూపాయలకు ఒకరివద్ద సేవకుడై యుక్తాయుక్తా లెరుగక పోవటంతో నవ్వు పుట్టించటం నాల్గవది, ఐదవ కథలో క్రింది ఉద్యోగుల నీతి కనిపెట్టడానికి రకరకాల వేషాలు వేసుకు తిరగటం, మూఢాచారాలను నమ్మనివాని కథ ఆరోది, పిసినిగొట్టు మరణిస్తే కాకులు పిండము ముట్టలేదనేది ఏడోది, గియ్యాళి గింగమ్మ సిగ్గువిడిచి భూములు పొందటం ఎనిమిదోది - ఇలా ఎనిమిది కథలూ విభిన్నమైన ఎనిమిది అంశాలతో చెప్పారు చిలకమర్తి చిత్రకథాగుచ్ఛంలో. రచన ప్రహసన ప్రాయంగా వుంది.

చిలకమర్తి హాస్య వాఙ్మయ నిర్మాతగా సుప్రసిద్ధులు. ప్రత్యేకంగా హాస్యం వెదజల్లే కొన్ని రచనలు చేసారు.

వినోదములు:

వినోదములు ఒకటి రెండు భాగాలు ప్రచురింపబడ్డాయి. వీటిల్లో కథలన్నీ ఆంధ్ర జనులు ఆనోట ఆనోట చెప్పుకుంటున్నవే. వాటికొక స్వరూపానిచ్చి గ్రంథస్థం చేసారు. ఈ కథలన్నీ హాస్య పూరితాలు, నీతి బోధకాలు. చిన్నచిన్న సంఘటనలు, కథాంశాలు, సభల్లో జరిగిన సంభాషణలు, ఇలా చాలావాటిని కూర్చారందులో. ఒకవిధంగా వాటికి ప్రహసన లక్షణం వుందని చెప్పచ్చు. వినోదాలు రెండో భాగంలో చాటు పద్యాలు చాలా వున్నాయి. రాజుల సంస్థానాలలో జరిగిన విశేషాలు చాలా వినోదంగా వివరించబడ్డాయి. తామర్లేను చక్రవర్తి, ఔరంగజేబు, జనకమహారాజు, భోజుడు, పెద్దాపురం సంస్థానాధీశుడు, వేములవాడ భీమకవి మొదలైనవారి విశేషాలు పద్యరూపంలో వివరించబడ్డాయి. ఇవి వినోదాలు, విజ్ఞానాత్మకాలు, నీతిబోధకాలు. ఇవన్నీ ఒకవిధంగా కథావాఙ్మయంలో చేర్చచ్చు.

నవ్వులగని:

చిలకమర్తి మరో హాస్యసృష్టి. ఇది రెండు భాగాలు. మొదటి భాగంలో 26 అంశాలున్నాయి. నూతన పంచాంగము, ప్రశ్నలు, పురమందిరము, శృంగారచేష్ట, రామసృష్టి - రావణసృష్టి, దెబ్బకు దేవేంద్రలోకము, వృద్ధవివాహము, ఎల్లవారు - గొల్లవారు, అడ్డబొట్టు - నిలువుబొట్టు మొదలైనవెన్నో. ఇవన్నీ హాస్యంతో కూడినవే. ఉదాహరణకి,

ప్రశ్నలు అనే దాంట్లో,

1. భాగ్యవంతుడు బీదవాడెప్పుడగును?
సమాధానం: పన్నులిచ్చుకోవలసి వచ్చినపుడును, కొడుకుగాని తమ్ముడుగాని చనిపోయిన తరువాత, కోడలుకో, మరదలికో మనువర్తి యిచ్చుకోవలసి వచ్చినపుడును మనుష్యులు పేదవారగుచుందురు.
2. చిన్నవాడు పెద్దవాడెప్పుడగును?
సమాధానం: తప్పు సాక్ష్యమీయవలసివచ్చి అనగా నలుబది యేండ్ల వయస్సు గలవారు తను పుట్టక మునుపుగాని, తన చిన్నతనములో జరిగిన సంగతి కాని కోర్టులో చెప్పవలసి వచ్చినపుడు "అబ్బో నేనిప్పటివాడనా, అరువది యేండ్లున్న"వని యొకడు, "ఆనకట్ట కట్టినప్పటి కైదేండ్లవాడి"నని యొకడు చెప్పి పెద్దవాడు కావలసిన యవసరము వచ్చును. సన్యాసులు చిన్నవారైనను పెద్దవారగుట అవశ్యము, ఏలయనగా "సన్యాసులలో చతుర్మాసము లెక్కడుగడిచిన వానికే గాని పూజలు గలుగవు."
3. తల్లిదండ్రుల యెడ భక్తిలేని వాడు ఎప్పుడు పరమ భక్తుడగును?
సమాధానం: తల్లిదండ్రులు చనిపోయిన తరువాత పరమభక్తుడగును – అంటారు.

పూల్సు (fools) కు నిర్వచనం చెప్తూ, "తన అసమర్థత గుర్తెఱుగక ఇతరులను హేళన చేయువాడు నాలుగవ వంతు పూలు, తన్ను లోకమందు తెలివి తక్కువయని ఎరుంగక యితరులను పూలు అనువాడు సగము పూలు" అని హాస్య నిర్వచనం చేసారు చిలకమర్తి.

నవ్వులగనిలో ఎంతటి హాస్యముందో అంతటి వ్యంగ్యముంది.

నూతన పంచాంగము అనే దాంట్లో కృమార్జాల దేవతాయై నమః అని ప్రారంభించి గీతపద్యం ఒకటి గణపతిపై రచించారు.

గీ॥ కుడుములన్ మెక్కి పొంగిన కడుపు, చేట
చెవులు, నేనుగు తొండంబు చెలువు గొలుప
రుబ్బురోల్పోత్రమట్లు కూర్చుండి కదల
లేని గణనాథు నవ్వులకై నుతింతు

"ఈ పంచాంగము కళంకీ, బ్రాహ్మణ మహావంశ జాతుండును, కేనచిచ్ఛిద్ధాంతినా గణిత పథక తస్కరుండును, కిరాత మహారాజాస్థాన విద్వాంసుండును, అగు కుండగోళక సిద్ధాంతిచే రచింపబడి, దౌర్భాగ్యపురము దగుల్బాజీ పేటలోని అకృతవాదిసీ ముద్రాక్షరశాల యందు దీర్ఘవాలపు గ్రామసింహారావు పంతులుగారిచే ముద్రింపబడి లోక వినోదార్థము ప్రకటింపబడియె" – ఈ వాక్యాలన్నీ వినోదార్థం రాయటంతో ఈ నూతన పంచాంగం నవ్వులగనే అని అర్థం

సంవత్సర ఫలములు అంటూ గుంటూరు అత్తరు సాహెబుకు మంచి లాభమని, అమావాస్య దినంబున చంద్రగ్రహణంబును, పౌర్ణమి దినంబున సూర్యగ్రహణంబును కేవల మదృశ్యములై సంభవించినను, పంటలు మొత్తము బాగుగనే పండినను, రయితులు పండలేదని గోలచేస్తారని చెప్పారు.

ఈ నూతన పంచాంగంలో ఇష్టదేవతా ప్రార్థన, గురుధ్యానము, పురవర్ణనము, ప్రభువర్ణనము, దైవజ్ఞప్రశంస, శాస్త్ర ప్రశంస మొదలైనవున్నాయి. గురుధ్యానములో

"డొక్క నెక్కడనయన నొక్కయక్కరమైన
గలిగియుండని మహాఘనుడెవండు
పలుమారు నోటిమాటలు నాడుటకైన
బదిమందిలో తడబడు నెవండు
పుట్టినదాది యేపొత్తమైనను చేత
బట్టి యెఱుంగని ప్రౌఢయెవడు
తనతెల్వి కెంద రెంతని సంతసించిన
మారుమాటాడని మౌని యెవడు

శుంఠలందరిలో మేటి శుంఠ యెవడు
భోజనమున కెంత దవ్వయిన పోవునెవడు
దర్భపోటన్న రయమున దరలునెవడు
అట్టి మద్గురు వర్యు నేనాత్మదలతు"

– ఇలాగే హాస్యస్ఫూర్తితో ప్రభువర్ణన చేసారు. ఎప్పుడూ తాగి నిద్రపోయే, ఐరాతుడనే వాడు ఆ ఊరి ప్రభువు. చిలకమర్తి ఈ సనాతన పంచాంగం చెప్పి మొత్తం ఒక చిన్న ప్రబంధం రాసినట్లుగా, రాసి నవ్వులు కురిపించారు –

పురవర్ణన చేస్తూ –

సీ॥ ఏమహాపట్టణం బేటేటతప్పక
పరశురామ ప్రీతి బరగుచుండు
ఏవీటనేటేట శ్రీమసూచీదేవి
లలి జమా బందీల సలుపుచుండు
ఏపురవీధులం దెల్ల పగల్ గృధ్రములు
రాత్రులందు నక్కలు చరించు
ఏయూర శునకంబులిండ్ల వాకిండ్ల
దొంగలు పెరళ్ళమైత్రి మెలగుచుంద్రు

ఏపురము జారిణుల కెల్ల కాపురంబు
ఏపురము త్రాగుబోతుల కెల్లయిరవు
ఏపురము కలహముల కిల్లు ఆపురంబు
పాపనిలయంబు దౌర్భాగ్య పట్టణంబు

చిలకమర్తి నవ్వులగని 1,2 భాగాలలో, ఇలాంటి అన్యోపదేశ హాస్యంతో చాలా విషయాలను గూర్చి వివరిస్తూ, వినోదం కోసం మాత్రమే ఇవి రాశానని స్పష్టం చేసారు. నవ్వులగని ఆ రోజుల్లో చాలా ప్రచారాన్ని పొందింది.

★ ★ ★

# జీవితచరిత్రలు

ఆంగ్లసాహిత్య ప్రభావం వలన ఆంధ్రసాహిత్యంలో వెలసిన ఎన్నో ప్రక్రియలలో జీవితచరిత్ర ఒకటి. సంస్కృతంలో బిల్హణుని విక్రమాంకదేవ చరిత్రము, బాణుని హర్షచరిత్రము జీవిత చరిత్రలే అయినా అవి ముఖ్యంగా కావ్యశైలిలో రచింపబడినవే.

జీవిత చరిత్ర లక్షణాన్ని చెప్తున్నవారందరూ ఇది కేవలం చరిత్రలాగ ఉండకూడదు అనే అంటున్నారు. లోకోత్తరమైన, ఆదర్శప్రాయమైన మహనీయుల జీవితాన్ని ఆదర్శంగా చూపాలనే కాంక్ష, తాము నమ్మిన మతాలను, విశ్వాసాలను వెలుగులోకి తెచ్చేందుకు వీలయితే మహాత్ములను లోకానికి పరిచయం చేయాలనే కాంక్ష మొదలయినవే జీవిత చరిత్ర రచన చేపట్టడానికి కారణాలవుతున్నాయి.

ఈ దృష్టే చిలకమర్తివారు మహాపురుషుల జీవిత చరిత్రలు రచించటానికి మూలకారణమైంది. "చరిత్రలు దేశాభ్యుదయమునకు తోడ్పడును కావున దేశచరిత్రలు మిక్కిలి అవశ్యకము. మహాపురుషుల చరిత్ర కలిసి దేశచరిత్ర అగును. కాబట్టి జీవిత చరిత్రలు మిక్కిలి అవశ్యకములు. మహాపురుషుల చరిత్రములు శ్రద్ధతో వ్రాసినవారున్న పక్షమున అది యువజనుల కాదర్శముగా నుండు" నని తెలిపారు చిలకమర్తి (స్వీయచరిత్ర – అవతారిక) చిలకమర్తి వారి 'మనోరమ' పత్రికలో మహాపురుషుల జీవిత చరిత్రలు ఎన్నో నెలలు ప్రచురింపబడ్డాయి చరిత్రకుండే సత్యకథనం, సాహిత్యానికుండే రమణీయ వచనం కలిసి పఠితలకు అనుభూతిని ఉపదేశాన్ని యివ్వగలిగివుండాలి జీవిత చరిత్రలు.

చిలకమర్తి వారు రచించిన జీవిత చరిత్రలు జీవిత రేఖా చిత్రాలు. మనిషి యొక్క రూపురేఖలతోపాటు, వ్యక్తి జీవలక్షణం కళ్లకు కట్టారు వీటిల్లో.

మహాపురుషుల జీవిత చరిత్రలు అనే గ్రంథంలో ముప్పై ఏడుగురి జీవిత చరిత్రలున్నాయి. ఇవి మూడు భాగాలు మొదటి భాగంలో బెంగాల్‌కు చెందినవారు, రెండో భాగంలో బొంబాయికి చెందినవారు, మూడో భాగంలో మద్రాసుకు చెందినవారు ఉన్నారు

ఇదికాక చిలకమర్తివారు జీవిత చరిత్రలు ఇంకా కొందరివి రాశారు. గురు నానక్, గురు గోవింద సింగు, నందచరిత్ర, సమర్థ రామదాసు, సిద్ధార్థచరిత్ర, విష్ణువర్ధనుడు, రామకృష్ణ పరమహంస, రాజా రామమోహనరాయలు, కాళిదాసు, వేమన – మొదలైన వారి చరిత్రలు రాశారు.

జీవిత చరిత్రలు ఆదర్శనీయంగా వుండాలనేది చిలకమర్తివారి లక్ష్యం. అందుకే "నిజమైన దేశాభిమానము, పరోపకార బుద్ధి, ధర్మకార్య శూరత్వమును వీరి వద్ద నుండి నేర్చుకొనవలయును" అన్నారు.

కేశవచంద్ర విద్యాసాగరుడు చిలకమర్తి దృష్టిలో మహనీయుడు వీరేశలింగంగారు రాజమహేంద్రవరం నుంచి వెళ్ళిపోయాక, వితంతు వివాహాలు తక్కువ సంఖ్యలో జరిగినా, చిలకమర్తివారు మూడు వితంతు వివాహాలు జరిపించారు ఈ వివాహాలకు బందరు నుంచి ఉన్నవ లక్ష్మీనారాయణగారు వచ్చి వధూవరుల నాశీర్వదించారు

బ్రహ్మసమాజ ప్రభావం చిలకమర్తి జీవితాన్ని చాలా ఎక్కువగా ప్రభావితం చేసింది బ్రహ్మసమాజ మత ప్రవక్తలయిన శివనాథ శాస్త్రి వంటివారు చాలామంది రాజమహేంద్రవరం వచ్చి ఉపన్యసించారు అప్పుడు వీరేశలింగంగారు బ్రహ్మమతాన్ని స్వీకరించి యజ్ఞోపవీతాన్ని పరిత్యజించారు. ఆ పనిని చిలకమర్తి సమర్థిస్తూ ఉపన్యసించారు.

యజ్ఞోపవీతాన్ని పరిత్యజించిన చాలామంది బెంగాలీయులలో కేశవచంద్రసేను డొకడు. కేశవ చంద్రసేనుడు స్త్రీ పునర్వివాహాన్ని ప్రోత్సహించాడు కేశవచంద్రసేనుని కూతురు కూచి బిహారు మహారాజును వరించింది. పిల్లకు పధ్నాలుగేళ్ళు నిండలేదు అంతకుముందు పిల్లకు పదహారేండ్లు, పిల్లవాడికి ఇరవై ఏళ్ళపైన ఉంటేనే పెళ్ళి చేయాలనే చట్టాన్ని కేశవ చంద్రుడు బ్రిటిష్ వాళ్ళను ప్రోత్సహించి చేయించాడు కానీ తన కుమార్తె వివాహం దగ్గర కొచ్చేసరికి దానిని లెక్కచేయలేదు ఈ సందర్భంగా చిలకమర్తి చాలా నిర్మొహమాటంగా "మంచి సంబంధము కుదిరినది కదాయని కక్కుర్తిచేత స్వమత ధర్మములు సరకుసేయక అనుచరుల హితోపదేశములు లెక్కగొనక లోకనింద కొడిగట్టి నిర్మలమగు తన వర్తనమునకొకమచ్చ దెచ్చుకొనెను" అని రాశారు.

చిలకమర్తి మధుసూదన దత్తు జీవిత చరిత్రలో "మైకేలు మధుసూదన దత్తు యొక్క జీవిత చరిత్రము నెరిగిన వారందరూ నేర్చుకోవలసిన మంచి నీతులొకటి రెండు కలవు" అని చెప్పి, బాల్యవివాహములే దేశానికి అరిష్టాలు తెస్తున్నాయి కనక వాటిని ఆపివేయాలని, ఇష్టములేని పెండ్లిండ్లు ఎప్పుడూ చేయరాదని, అంతేకాక, కవిత్వము మొదలైన వాని విషయాలలో అందరూ వెళ్ళే మార్గంలోనే వెళ్ళక్కర్లేదని, మొదట నిందించినా, తరువాత గౌరవిస్తారని చెప్పి, ఈ విషయాలు తెలుసుకోటానికి మైకేలు మధుసూదన దత్తు చరిత్ర అవశ్య పఠనీయమన్నారు

నానకు చరిత్రలో "నానకు పరమార్థమెరుగక గతానుగతికముగ నధోగతి పాలగుచుండిన తోడిజనుల నుద్ధరించుటకు దారిచూపిన మహానుభావుడగుటచే అతని చరిత్రము నెల్లవారలు చదువదగినది" అన్నారు. నానకు పుట్టుక మొదలు అరవై సంవత్సరాల వరకు చరిత్ర రాశారు.

నంద చరిత్రలో "మన దేశమున మాలవాండ్ర స్థితి ఎట్లున్నదో చెప్పనక్కరలేదు. దక్షిణ దేశమున మాలవాండ్రు పల్లెటూళ్ళలో వీధుల నడుమ నుండి నడువకూడదు. వారికేవిధమయిన విద్య లేదు" అంటూ ఆనాటి పరిస్థితిని తెల్పారు. అంతేకాదు, చిలకమర్తి నిమ్న జాత్యుద్ధరణకై చాలా పాటుపడ్డాడు. పాఠశాలలు స్థాపించారు

సమర్థ రామదాసు చరిత్ర పది ప్రకరణాలలో రాసారు. "రామదాసు అను పేరు వినగానే గోలకొండ నవాబుల వద్ద కొలువుచేసి భద్రాచలమునకు తహసీలుదారుడై, నవాబు సొమ్మంతా శ్రీరామునకు దేవాలయము కట్టించుటకు, ఆదేవుని కైంకర్యము

చేయుటకు వినియోగించిన కంచర్ల గోపన్న యను పేరుగల రామదాసే మన యాంధ్రులకు జ్ఞప్తికి వచ్చును. కానీ మత రాజకీయ విషయములలో నధిక కృషి చేసి, మహారాష్ట్ర దేశము నుద్ధరించి, శివాజీ అంతవానికి గురువై దేశప్రఖ్యాతి గాంచిన సమర్థ రామదాసు పేరు నూరుమందిలో పదిమందికైనను జ్ఞప్తికి రాదుగదా! ఆ మహాత్ముని చరిత్రను ఆంధ్రులకు తెలియజేయుటకే యీ గ్రంథమును నేను రచించియున్నాను" అన్నారు చిలకమర్తి.

చిలకమర్తివారు రచించిన జీవిత చరిత్రలు ఎన్నో వున్నాయి. అన్నిటా ఏదో విధమైన నీతి బోధ వుంది.

★ ★ ★

# స్వీయచరిత్ర

ఆంగ్లసాహిత్య ప్రభావంతో తెలుగులో ప్రవేశించిన ప్రక్రియ స్వీయచరిత్ర. స్వీయచరిత్ర అంటే ఆత్మకధ. తనకూ కొంత చరిత్ర వుందనే ఆత్మవిశ్వాసం వుంటేనే స్వీయచరిత్ర రాయటం జరుగుతుంది.

స్వీయచరిత్ర రాయటం చాలా కష్టం. సమకాలీన సమాజాన్ని చూపించవలసి వచ్చినపుడు, సజీవులైన వ్యక్తుల గూర్చి రచించవలసి వచ్చినపుడు కొంత చిక్కు తప్పదు. స్వీయచరిత్ర కర్త సత్యకధన సమర్థుడై వుండాలి. తన అనుభవాలను తనే చక్కగా చెప్పకలిగినవాడయి వుండాలి. "ఎవరి చరిత్ర వారే వ్రాసుకొన్న పక్షమున విషయము లన్నియు సంపూర్ణముగ ఉదహరించుట కవకాశముండును" అన్నారు చిలకమర్తి. తెలుగు సాహిత్యంలో స్వీయచరిత్రలు తక్కువ సంఖ్యలోనే వున్నాయని చెప్పాలి. స్వీయచరిత్రలు – ఆత్మకథలూ జ్ఞాపకాలూ జతచేస్తే ఏర్పడేవే.

"ఘనకార్యములు చేసిన మహాపురుషులు పరులకు మార్గదర్శకముగా నుండుటకై తమ చరిత్రలు తప్పక వ్రాయవలయును. మహాత్మా గాంధీగారు, జవహర్ లాల్ నెహ్రూగారు మొదలగువారు ఉత్తమ జీవితములు జీవించి, స్వార్థత్యాగులై, లోకోపకారపరాయణులగుటచే వారి జీవితము లమూల్యములు. మన యాంధ్ర దేశమున మొట్టమొదట స్వీయచరిత్రము వ్రాసుకొన్న మహనీయులు రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు. ఆ మహా పురుషుని చరిత్ర మంతయు స్వార్థత్యాగముతోను, లోకోపకారమైన ఘనకార్యములతోడను నిండియున్నది కావున వారి స్వీయచరిత్రము నిశ్చయముగా నాంధ్రసారస్వతమున కలంకారమై యాంధ్రజనులకు మార్గదర్శకమై యున్నది" అని చెప్పి, వల్లూరి సూర్యనారాయణరావు గారు, రాయసం వెంకట శివుడుగారు స్వీయచరిత్రలు రాసుకొన్నారని, అవి ఆదర్శప్రాయమైనవని చిలకమర్తి తెల్పారు.

"తన్ను గూర్చి తాను వ్రాసుకొనునపు డీశ్వరుని ముఖమును చూచి సత్యమునే చెప్పబూనినను, సమకాలపు వారది ఆత్మస్తుతిగానో, పరనిందగానో చేకొని యన్యధా భావింపదగును" అన్నారు (స్వీయచరిత్ర – 10).

చిలకమర్తి వారి స్వీయచరిత్రకి కొంత ప్రత్యేకత వుంది. ఆయన పుట్టంధుడు కాకపోయినా దృష్టిలోపముంది. దినచర్య గ్రంథాలు రాయలేదు. గొప్ప జ్ఞాపకశక్తి కలవాడు. ఏకసంథాగ్రాహి. స్వీయచరిత్ర నంతటినీ, అంటే డెబ్బైఐదేళ్ళ చరిత్రను రచించారు. 18–3–1942 న ప్రారంభించి 12–7–1942 న ముగించారు

1928వ సంవత్సరము మార్చినెలలో చిలకమర్తి షష్టిపూర్తి జరిగింది. రాజా వేంకట రంగారావు బహదుర్ రాజమహేంద్రవరము వచ్చి, చిలకమర్తిని స్వీయచరిత్ర

రాయమని కోరారు. దానికి తోడు రాయసం వెంకటశివుడు, విస్సా అప్పారావు, అడవి శంకరరావు మొదలైనవారు చిలకమర్తిని స్వీయచరిత్ర రాయమని ప్రోత్సహించారు. అయితే అంధత్వము, ధనాభావము వలన వెంటనే రాయలేకపోయిన చిలకమర్తి, "నిర్విచారముగ నిర్మలమైన మనసుతో వ్రాయవలసిన గ్రంధము, చిక్కులలోబడి మనస్థిమితము లేని నేనెట్టు వ్రాయగలనని" వితర్కించుకున్నారు.

ఆ పరిస్థితుల్లో రాయసం వేంకట శివుడు చిలకమర్తికి ధన సహాయం ఏర్పాటుచేసి స్వీయచరిత్ర రచనకు తొందరచేశారు.

చిత్రభాను సంవత్సరం చైత్ర శుద్ధ విదియనాడు (18-3-1942) చిలకమర్తి స్వీయచరిత్రను గుమస్తాచేత రాయింప ప్రారంభించారు.

రాజమహేంద్రవరంలో వుండగా గుమస్తా దొనపర్తి సత్యనారాయణగారిచేత నూటతొంభైఐదు పుటలు రాయించారు. కాకర్రపట్టు వెళ్ళిన తర్వాత మిగిలిన గ్రంధమంతా చిలకమర్తివారి మేనల్లుడైన పురాణపండ వేంకట దీక్షితులు రచించిపెట్టాడు.

స్వీయచరిత్రలో ప్రకరణ విభజన వుంది. ఇరవై యొక్క ప్రకరణాలున్నాయి. వీటన్నిటిని పరిశీలిస్తే బాల్య, యౌవన, కౌమార, వార్ధక్య దశలన్నీ స్వీయచరిత్ర ద్వారా తెలుస్తాయి.

స్వీయచరిత్ర సాంఘిక చరిత్రే. చిలకమర్తివారు కందుకూరి వారి అడుగుజాడల్లో సంస్కరణోద్యమానికి, సాహిత్యానికి, తెలుగు నాటకరంగానికి అపారమైన సేవ చేశారు. ఆంధ్రదేశంలో స్త్రీ విద్యకి, స్త్రీ జనోద్ధరణకి, నిమ్న జాత్యుద్ధరణకి ముందంజ వేసిన మహనీయులలో చిలకమర్తి ముఖ్యులు.

చిలకమర్తి సంస్కరణాభిలాష అన్ని ప్రకరణాలలోను కనిపిస్తుంది. చిలకమర్తి సోదరి సుబ్బమ్మ వివాహ విషయం తెలుపుతూ ఆయన చాలా బాధపడ్డ విషయం, ఏభైపడిలో వున్న రాయప్పావధానికి పది సంవత్సరాల లోపు పిల్లనిచ్చి పెళ్ళిచేయటం ఎంతో అన్యాయంగా భావించి, విమర్శించారు. "ముసలిదయ్యాల కిచ్చి పెండ్లిచేసి బలియిత్తురు" అన్నారు.

శ్రాద్ధకర్మలలో చిలకమర్తికి నమ్మకంలేదు. చిన్నతనంలో తండ్రి బలవంతం మీద భోక్తగా వెళ్ళవలసి వచ్చేది. తల్లి, మేనమామలను బాధపెట్టలేక మాత్రమే తండ్రి కర్మకాండను చేశారు చిలకమర్తి

రాజమహేంద్ర వర విద్యాభ్యాసం చిలకమర్తి జీవితాన్ని చాలా ప్రభావితం చేసింది.

1888 లో ఏలూరు నాటక సమాజం రాజమహేంద్రవరం వచ్చింది. అంతకుముందే ధారవాడ నాటక సమాజం నాటకాలు వేసింది. ఇవన్నీ చూసిన చిలకమర్తి నాటక కర్త అయ్యాడు.

చిలకమర్తి పాఠశాల స్థాపన గొప్ప విషయం. నిమ్నజాత్యుద్ధరణ కోసం రాత్రి పాఠశాల పెట్టాడు.

స్త్రీ విద్య నిమిత్తమై చాలా పాటుపడ్డాడు. వితంతు వివాహాలు జరిపించాడు. భోగం మేళాలను విమర్శించాడు. భాషా విషయకంగా మార్పులకు స్వీయచరిత్రలోనే

కీలక ఆధారం కనిపిస్తుంది. గ్రాంథిక వ్యావహారిక భాషావాదాలు తలెత్తిన సమయమది. వ్యవహారిక వాదంతో పూర్తి అంగీకారం చిలకమర్తికి కుదరకపోయినా, గిడుగు రామ్మూర్తి గారు, గురజాడ అప్పారావుగార్లపై గౌరవాభిమానా లుండేవి.

చిలకమర్తి స్వీయచరిత్ర ఎన్నోవిధాల సాంఘిక చరిత్రగా నిరూపింపబడింది. "బుద్ధి పూర్వకముగా నేనేమియు అసత్యమును వ్రాయలేదు" అని స్వీయచరిత్ర అవతారికలో చిలకమర్తి తెల్పారు. స్వీయచరిత్ర ఆసక్తిదాయకంగా చదవటానికి ముఖ్యకారణం వచన రచనాశైలి.

స్వీయచరిత్రలలో చిలకమర్తి స్వీయచరిత్ర ఎన్నదగింది. సాంఘిక సంస్కరణలే కాక అనాటి ఎందరో మహానుభావులను కూడా పరిచయం చేషి, వారి ఆదర్శ జీవితాలను కళ్ళ ముందుంచింది.

స్వీయచరిత్ర చాలా విషయాలు అందజేసింది. చిలకమర్తి వ్యక్తిగత విశేషాలు కూడా సత్యకథనం ద్వారా దాచకుండా రాసారు. చిలకమర్తికి పెళ్ళినాటికి ఇరవై ఆరేళ్ళు. సాధారణంగా ఇరవైఏళ్ళ లోపునే పెళ్ళి అయ్యేది మగపిల్లలకు. చిలకమర్తికి వివాహం ఆలస్యం కావటానికి కారణం ఆయన అంధుడని బంధువర్గంలో ప్రచారముండటమే. "ఎట్టకేలకు నేను వివాహము లేక ఘోటక బ్రహ్మచారినై యుండుట యిష్టములేక, మా తల్లిదండ్రులు శ్లాఘాపాత్రము గాని యొక వివాహము నాకు జేసిరి" అన్నారు చిలకమర్తి. కుండమార్పిడి పెళ్ళి ఇష్టంలేకపోయినా తల్లిదండ్రుల దుఃఖం చూడలేక అంగీకరించాల్సి వచ్చింది. ఇందులో కూడా చిలకమర్తి చెల్లెలు రమణమ్మకు చిన్న తిరుపతిలో వివాహం చేయాలని మొక్కుకొన్నారు. కానీ చిలకమర్తి మామగారు ఖర్చుపెట్టి చిన్న తిరుపతిలో పెళ్ళి చేయడానికి ఒప్పుకోలేదు. దాంతో ఉభయుల ఖర్చులు చిలకమర్తి తండ్రి భరించాల్సి వచ్చింది. ఆ సమయంలో చిలకమర్తి శిష్యుని తండ్రి చిలకమర్తి వివాహానికి 200 రూపాయలు ఇస్తే, మరో 100 రూపాయలు అప్పుజేసి చిలకమర్తి తండ్రికి అందజేశాడు. చిలకమర్తి రైలుబండి ఎక్కటం అదే మొదలు. '1893 లో మన జిల్లాలలో రైలుబండి నడిచెను' అన్నారు చిలకమర్తి. 1890 లో ప్రారంభింపబడి 1893 లో పూర్తయిన ఈ ఇనుపదారికి తూర్పుతీరపు టినుపదారి (East Coast Railway) అని పేరుపెట్టారు

ఐదు రోజుల వివాహము జరిగింది. చిలకమర్తి భార్యకి పది సంవత్సరాలు.

చిలకమర్తి జాతీయ కాంగ్రెసు మహాసభకి (All India National Congress) చెన్నపట్నం వెళ్ళారు. అక్కడ కంటిపరీక్ష చేయించుకోవాలనే భావం కూడా వుంది. అక్కడ చిలకమర్తి స్నేహితుడైన పోలవరపు జమీందారుగారు పరశువాకమనే పేటలో వున్నారు. జమీందారుగారు తన యింటనే చిలకమర్తికి బస ఏర్పాటుచేసి, నేత్ర పరీక్ష కూడా చేయిస్తానన్నారు. కాంగ్రెస్ మహాసభలో గొప్ప వక్తయైన సురేంద్రనాథ్ బెనర్జీ గారిని, దేశాభరణమైన మదనమోహన మాలవ్యాగారిని చూచి వారి మహోపన్యాసాలు విని ధన్యుడయ్యాడు చిలకమర్తి. చెన్నపురిలో నెలా పదిహేను రోజులుండి, జమీందారుగారి బండిలో అన్ని ప్రదేశాలు చూసారు.

చిలకమర్తి తండ్రి వీరవాసరములో ఒక పెంకుటిల్లు కష్టపడి కట్టారు. చిలకమర్తి కొంత ధన సహాయం చేసారు. గృహప్రవేశానికి వెళ్ళలేకపోయారు. కానీ

ఇల్లు కట్టుకొన్న కొద్ది కాలానికే తండ్రి మరణించారు. అప్పుడు ఉత్తరక్రియలు చేయటానికి బ్రాహ్మణుడు దొరకలేదు. "మేము ఋగ్వేదులమగుటచే అశ్వలాయన సూత్ర ప్రకారము మా తండ్రిగారికి ఉత్తర క్రియలు జరపవలసి యుండెను. కానీ ఋగ్వేదమంత్రము చెప్ప బ్రాహ్మణుడు చుట్టుపక్కల నెక్కడను దొరకలేదు. అందుకని యజుర్వేద మంత్రము చేతనే కర్మకాండ పూర్తిచేయవలసి వచ్చింది."

ప్రార్థనా సమాజం గురించి చాలా చెప్పారు వీరేశలింగంగారు ఏఏటా ప్రార్థనా సమాజ వార్షికోత్సవాలలో టవునుహాలులో ధర్మోపన్యాసం చేసేవారు. ఆ ఉపన్యాసాలు చిలకమర్తి శ్రద్ధగా వినేవారు. వీరేశలింగం గారు సారంగధర మెట్ట మీద సాయంకాలము ప్రార్థనలు చేసేవారు. వారితోపాటు విద్యార్థులు, సమాజ సభ్యులు అరవైమంది దాకా సారంగధర మెట్ట మీదికి వెళ్ళేవారు. రాత్రి ఎనిమిదయ్యాక మెట్ట దిగి ప్రార్థన గీతాలు పాడుతూ, పట్టణము చేరి ఇళ్ళకెళ్ళేవారు. చిలకమర్తి కూడా వీరితోపాటు వెళ్ళేవాడు. 1895 లో జరిగిన ప్రార్థనా సమాజ వార్షికోత్సవాలలో చిలకమర్తి ధర్మోపన్యాసం చేసారు. ఆ ఉపన్యాసం సారంగధర మెట్టమీద, చిలకమర్తి మిత్రుడైన దుర్గి గోపాలకృష్ణారావు చేత చదివించాడు. ఆ ఉపన్యాసం 'రాజయోగి' అనే వారపత్రికలో ప్రకటింపబడింది.

చిలకమర్తి పృథ్వీ రాజీయమనే గ్రంథం రెండాశ్వాసాలు 1899 నాటికి పూర్తిచేశారు. రెండు వందల పద్యాలున్నాయి వాటిలో పృథ్వీ రాజీయంలో పద్యాలు అప్పుడప్పుడు విని, బాగున్నాయని సుబ్బారాయుడు గారనే పిఠాపురం మహారాజుగారి కార్యదర్శి చాలాసార్లు మెచ్చుకున్నాడు. వాటిని అచ్చువేయించమని కోరాడు చిలకమర్తి ఆ రెండాశ్వాసాల గ్రంధాన్ని ఒక పెట్టెలో పెట్టాడు. ఆ పెట్టెకి తాళం లేదు. అది పనికిమాలిన పుస్తకమనుకొని చిలకమర్తి పెద్ద మేనకోడలు రావూరి వేంకట సుబ్బమ్మ చింపేసింది. ఆ విధంగా పృథ్వీరాజీయం నామావశేషమైంది. ఆ పుస్తకం అలా పోయాక చిలకమర్తి చాలా విచారించారు. "మృతి నొందిన బాంధవునికై విచారించుట యెట్టిదో, నాశనమైన పుస్తకమునకై విచారించుట యట్టిదేకదా" అని రాసారు స్వీయచరిత్రలో.

చిలకమర్తి ఏకసంథాగ్రాహి. వడ్డాది సుబ్బారాయుడి గారి 'వేణీసంహార' నాటకంలో, శ్రీకృష్ణుని స్తుతించే దండకం ఒకటుంది. అది సుబ్బారాయుడుగారు చదువుతుంటే చిలకమర్తి ఒళ్ళు పరవశించింది. ఆ దండకం పారిజాతాపహరణ ప్రబంధంలోది. చిలకమర్తి ఆ ప్రబంధాన్ని మూడు అణాలిచ్చి కొని, ఎనభై పంక్తుల దండకం ఒక్కపూటలో వల్లించేసాడు. "వల్లించి ఏబది సంవత్సరము లయినను నా కది యిప్పటికిని పూర్తిగ జ్ఞాపకమున్నది నా శరీర దౌర్బల్యము లెన్నియున్నను భగవంతుడు నాకు పరిపూర్ణ కటాక్షముతో జ్ఞాపకశక్తి మెండుగ నిచ్చెను" అన్నారు. వీరేశలింగంగారి వివేకవర్ధనీ ముద్రాక్షర శాలలో వేణీసంహార నాటకం అచ్చవుతుంటేనే, ఉత్సాహం ఆపుకోలేక చిలకమర్తి అచ్చుపడిన కాగితాలు మిత్రునిచే తెప్పించి, పద్యాలు నేర్చేశాడు. వడ్డాది సుబ్బారాయుడు చిలకమర్తిని "ఛాయాగ్రహణ యంత్ర"మని (కెమెరా) పిలిచేవారు. ఎవరైనా పద్యం ఒకసారి చదివితే చిలకమర్తికి నోటి కొచ్చేసేది. ఒకసారి చిలకమర్తి జ్ఞాపకశక్తిని పరీక్షించడానికి కళాపూర్ణోదయంలోని ఒక పద్యం గంభీరంగా చదివారు సుబ్బారాయుడుగారు. ఆయన చదివిన పద్యం చిలకమర్తి

వెంటనే చదివేశారు. సుబ్బారాయుడుగారితో వచ్చినవారు చిలకమర్తి జ్ఞాపక శక్తిని మెచ్చుకున్నారు.

వేణీసంహారం గురించి మొదట విన్నప్పుడు సుబ్బారాయుడి మీద ఓ పద్యం చెప్పారు.

క॥ "వేణీ సంహారంబును
వాణీ ధవ తుల్యుడైన వసురాయుడు తా
నాణెముగా తెనిగించెను
ప్రాణంబులు లేచివచ్చు పద్యము 'విన్నన్"

మండల సభాయాత్రల గురించి చిలకమర్తి చాలా రాసారు. పోలవరం జమీందారు తనతోపాటు చిలకమర్తిని మూడు మండల సభలకి తీసుకెళ్ళారు. కృష్ణామండల సభ గుంటూరులో మే నెలలో జరిగింది. ఆ సభలకు రఘుపతి వేంకట రత్నం నాయుడు అధ్యక్షులు. జమీందారుగారితో చిలకమర్తి, భీమశంకరముగారు కూడా వెళ్ళుబట్టి సన్మాన సంఘము సమస్త మర్యాదలు వీరిక్కూడా చేసింది. ఆ సభల రెండోనాడో మూడోనాడు విక్టోరియా రాణీ గారికి మంత్రి, చాలా గౌరవపాత్రుడయిన గ్లాడ్‌స్టన్ దొర గారు లండన్‌లో మరణించిన వార్త వచ్చింది. ఆ సభ అర్ధగంటసేపు గ్లాడ్‌స్టన్ గౌరవార్థం నిలిపివేయబడింది. ఆ సమయంలో జమీందారుగారు చిలకమర్తిని పిలిచి, గ్లాడ్‌స్టన్‌పై కొన్ని పద్యాలు చెప్పమని కోరారు. కాగితముపై రాయక, మనసులో ధారణ చేసుకొని ఐదారు పద్యాలు ఆ సభలో చిలకమర్తి చదివారు.

విజయనగరంలో రెండో మండల మహాసభ జరిగింది. అక్కడికి చిలకమర్తి, భీమశంకరము గారు పోలవరపు జమీందారుతో వెళ్ళారు సుప్రసిద్ధ న్యాయవాది, దేశసేవా పరాయణుడైన గంజాము వేంకటరత్నం పంతులుగా రధ్యక్షులు. అక్కడ కూడా చిలకమర్తి గ్లాడ్‌స్టన్ దొరపై పద్యాలు చదివి మెప్పు పొందారు. అప్పుడే ఆ విజయనగరంలో కళాశాలలో ఆంగ్ల పండితుడైన గురజాడ అప్పారావుగారితో చిలకమర్తికి పరిచయమైంది. విశాఖపట్నంలో వుండగా శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవవర్మగారితో పరిచయమేర్పడింది.

చిలకమర్తి, జమీందారుగారితో కలిసి చాలా సభల కెళ్ళారు. నాలుగవ గోదావరీ మండల సభ రామచంద్రపురం తాలూకా పసలపూడిలో 1898 లో జరిగింది. ఆ సభలు అయ్యాక జమీందారుగారు కాకినాడ, చిలకమర్తి రాజమహేంద్రవరమూ, శంకరంగారు ఏలూరు వెళ్ళిపోయారు.

కొన్ని పత్రికల గురించి చిలకమర్తి వివరించారు. సంఘ సంస్కరణకై పాటుపడిన 'సత్యవాదిని' పత్రికకి, శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారిచే స్థాపింపబడిన, కాకినాడలో నడుపుచున్న 'ఆర్యమత బోధిని' అనే పూర్వాచార పరాయణ పత్రికకు అభిప్రాయ భేదాలు రోజురోజుకీ పెరిగిపోయాయి. బ్రహ్మయ్య శాస్త్రి గారి పత్రికలో వీరేశలింగంగారి అభిప్రాయాలను ఖండించేవారు. వీరేశలింగంగారు సత్యవాదిని పత్రికలో బ్రహ్మయ్యశాస్త్రిగారి అభిప్రాయాలు ఖండించేవారు. అప్పుడు చిలకమర్తి కూడ సత్యవాదినిలో బ్రహ్మయ్యశాస్త్రి గారి మీద కొన్ని రాతలు రాశారు. అందులో

కొన్ని "అనుచితములైన వ్రాతలు కూడ గలవు" అన్నారు "వయఃపరిణామము నందిన ఈ కాలమున నాటి వెకిలి వ్రాతలు తలచుకొన్న యేమనాలో నాకే సిగ్గుచుండును" అన్నారు.

ప్రకాశంగారి సీమప్రయాణం అనేది ఒక ప్రత్యేకాంశంగా చెప్పారు చిలకమర్తి. 1904 లో బారిష్టరు పరీక్ష చదవటానికి ఇంగ్లాండు వెళ్ళారు ప్రకాశంగారు. విదేశీ ప్రయాణం చిలకమర్తికీ యిష్టమే కనుక, వెళ్ళమని ప్రకాశాన్ని ప్రోత్సహించారు. ప్రకాశం కొంతకాలం సీమలో వుండి 1905 లో జూలై 16 న రాజమహేంద్రవరం వచ్చారు. ప్రకాశంగారికి ఈ సందర్భంగా విందు చేయాలని చిలకమర్తి తలపెట్టి స్నేహితుడైన తల్లాప్రగడ చలపతిరావును ప్రోత్సహించారు.

ఆ విందుకు కొంతమంది స్నేహితులని పిలిచాడు చిలకమర్తి. అయితే ఆ విందుకు వచ్చిన వారి పేర్లన్నీ సత్యవాదిని పత్రికలో నిర్భయంగా ప్రకటించారు. దాంతో పట్టణంలో గొప్ప గొడవ బయలుదేరింది. సీమ కెళ్ళిన వాళ్ళతో విందు భోజనం చెయ్యటం మహా పాతకమని అభిప్రాయపడ్డారు. వైదిక శిఖామణులు మార్కండేయ స్వామి ఆలయంలో సభచేసి, అభినవ విరూపాక్ష మఠాధిపతులైన శ్రీ శంకరాచార్య స్వామి వారికి తెలియజేశారు. ఆ స్వాములవారు ప్రకాశం గారిని, చలపతిరావు గారిని వెలివేసి, విందులో పాల్గొన్న వారందరికీ "విందులో పాల్గొన్నారట నిజమా?" అని లేఖలు రాశారు. చిలకమర్తి ఆ లేఖ అందుకొని జవాబు రాశారు. "శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య వర్య" అను బిరుదంతో జాబు రాయాలి. కానీ అలా రాయక నమస్కారములు అని రాసి, విందులో నేను ప్రకాశంగారి పంక్తిని భోజనం చేశానని రాసారు. అయితే ఆ సమాధానం స్వామివారికి నచ్చలేదు. అది గురుధిక్కారంగా భావించారాయన. అప్పటినుండి ఆ విందుభోజనం చేసినవారిని వెలివేసే ప్రయత్నం చేస్తూనే వున్నారు శ్రీ శంకరాచార్య స్వాములవారు. ఒకసారి స్వామివారు రాజమహేంద్రవరం వచ్చినపుడు కొందరు వారిని కలిసి ఆ వెలిపత్రికలు ఉపసంహరింపుమని కోరారు.

మార్కండేయ స్వామివారి ఆలయంలో ఒక సభ చేసారు. ఏనుగునెక్కి స్వాములవారు వచ్చారు. ప్రకాశం సరదాకి సీమకి వెళ్ళలేదని, విద్యార్జన కోసం వెళ్ళాడని కొందరు చెప్తుంటే, వీరిలో కొందరు ఆ వాదనని అధిక్షేపిస్తున్నారు. సభలో గందరగోళం చెలరేగింది. సభాజనులు తనను తంతారనే భయం కలిగి, స్వాములవారు పాదుకలు ధొడుక్కొని దొడ్డి గుమ్మం ద్వారా శంకరమఠం చేరారు. స్వాములవారు వచ్చిన ఏనుగు దేవాలయ సింహద్వారం దగ్గర వీధిలో వుంది. అలా పారిపోయిన స్వాముల వారు – సీమ ప్రయాణం వ్యతిరేకించినందుకు, తనను కొట్టటకే సభ ఏర్పాటు చేశారని దురభిప్రాయపడ్డారు. ఎవరు ఎంత చెప్పినా వినలేదు. చిలుకూరి వీరభద్రరావుగారు తమ 'ఆంధ్రకేసరి'లో ఈ విషయమై రాస్తూ, ఏనుగు తలక్రిందుగా పడిపోయినట్లు బొమ్మ గీయించారు.

ప్రకాశంగారు 1905 సంవత్సరంలో రెండోసారి లండను వెళ్ళారు.

చిలకమర్తి తల్లి మరణించినపుడు, గ్రామ పురోహితుడు చిలకమర్తి కర్మచేయటానికి వీల్లేదని, కారణం ప్రకాశంగారితో విందులో పాల్గొన్నారని చెప్పి, ప్రాయశ్చిత్తము

చేసికోమన్నాడు. కాని చిలకమర్తి అందుకు అంగీకరింపలేదు. తల్లిమరణం చిలకమర్తిని చాలా బాధించింది "ఆమె ఋణమెన్నడు నేను దీర్చుకోజాలను పునర్జన్మమున్న పక్షమున మరల నామె గర్భముననే జన్మింపవలెనని నా కోరిక అటువంటి ఉత్తమ మాత కడుపున పుట్టుట దుర్లభము" అన్నారు

వితంతు వివాహాల విషయంలో రాజమహేంద్రవరంలో జరిగిన విశేషాలు చాలా వున్నాయి. 1907 లో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వీరేశలింగం గారి దగ్గరకొచ్చి "వితంతు వివాహములు శాస్త్రీయములా, అశాస్త్రీయములా? చేయదగినవా, చేయకూడనివా అనే విషయంపై చర్చ చేయ"మని అధ్యక్షులుగా వుండమని కోరారు "పాతిక సంవత్సరాలనుండి వితంతు వివాహాలు జరుగుతున్నాయి ఈ విషయంలో నేను చర్చకి అధ్యక్షునిగా వుండను. కావాలంటే లక్ష్మీనరసింహాన్ని అధ్యక్షునిగా వుండమనం"డన్నారు.

వితంతు వివాహోద్యమాన్ని ఖండించటానికి బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు వచ్చారు. ఓ గంటసేపు బ్రహ్మయ్యగారు వితంతు వివాహాలను ఖండిస్తూంటే, మధ్యమధ్యలో సభ్యులు అడ్డంతగులుతూ వచ్చారు. తరువాత చిలకమర్తి, బ్రహ్మయ్యశాస్త్రి గారు చెప్పిన యుక్తులన్నిటినీ ఖండించారు. ఆ పరిస్థితి చూసి బ్రహ్మయ్యశాస్త్రిగారు మరుసటి వారం వచ్చి శాస్త్ర విషయాలు ప్రసంగిస్తానని చెప్పి వెళ్ళిపోయారు. మళ్ళా రాలేదు.

తెలుగులో వ్యావహారికభాష ఉపయోగించాలా, గ్రాంథికభాష ఉపయోగించాలా అనే సమస్య ఎక్కువగా వుంది ఆరోజుల్లో పిఠాపురం మహారాజా గ్రాంథిక భాషావాది. విశాఖపట్నం వ్యావహారిక భాషాపరులకు ఆటపట్టు. అక్కడకెళ్ళి గ్రాంథిక భాష గురించి గొప్ప ఉపన్యాస మీయమని రాజాగారు చిలకమర్తిని ఖర్చులిచ్చి పంపారు. వారినేకాక పురాణపండ మల్లయ్య శాస్త్రిగారిని, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిని, కూచి నరసింహంగారిని పంపారు. భాషా విషయమ్మై పెద్ద సభ జరిగింది. ఒక గంటసేపు చిలకమర్తి గ్రాంథిక భాషావశ్యకతపై ఉపన్యసించారు. యుక్తులు, ప్రమాణాలు చూపారు. ఉపన్యాస మెట్లుందో చెప్పలేను కానీ, నా మనసుకు మహా సంతుష్టిగా వుంది అన్నారు చిలకమర్తి.

1915 లో డిశంబరులో చిలకమర్తి హైదరాబాదు (దక్కన్) వచ్చారు. ఆంధ్ర భాషాభిమానులైన మాడపాటి హనుమంతరావుగారు మొదలైన వారు శ్రీకృష్ణదేవరాయల పేర స్థాపించిన గ్రంథాలయ వార్షికోత్సవానికి చిలకమర్తిని అధ్యక్షులుగా ఆహ్వానించారు. కీర్తిశేషులైన రావిచెట్టు రంగారావుగారి ధర్మపత్ని లక్ష్మీనరసమ్మగారింట్లో చిలకమర్తికి బస ఏర్పాటుచేశారు. ఆ సభలో సరోజినీనా యుడుగారు, సర్ అక్బర్ హైదరీ గారు వున్నారు. ఆ సభలో సన్మానింపబడ్డాడు చిలకమర్తి. తరవాత సికింద్రాబాదులో సంస్కృతభాష మీద, సంఘ సంస్కారణమీద రెండుపన్యాసాలు చెప్పారు. స్త్రీలకొరకు ఏర్పరచిన ప్రత్యేక సభలో స్త్రీవిద్య గురించి ఉపన్యసించారు. చిలకమర్తి రాజమహేంద్రవరం వచ్చాక, పూర్వాచార పరాయణులైన వీరభద్ర పాకయాజిగారు, సికింద్రాబాదులో చిలకమర్తి చెప్పిన ఉపన్యాసాలను ఖండించారని పత్రికలో చదివారు.

చిలకమర్తి షష్టిపూర్తి విశేషాలెన్నో తెలుస్తాయి ఇందులో. న్యాపతి సుబ్బారావు పంతులు గారధ్యక్షులుగా, పాలకోడేటి గురుమూర్తిగారు కార్యదర్శిగా షష్టిపూర్తి సంఘం ఏర్పడింది. షష్టిపూర్తి సంఘంలో ఇరవై తొమ్మిదిమంది సభ్యులున్నారు రఘుపతి వేంకటరత్నం నాయుడు, కట్టమంచి రామలింగారెడ్డి, వేపా రామేశంగారు, మునగాల రాజా నాయని వేంకట రంగారావుగారు, సర్వేపల్లి రాధాకృష్ణ, కాశీనాధుని నాగేశ్వరరావు, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రి, కొండా వెంకటప్పయ్య, రాయసం వెంకటశివుడు, మాడపాటి హనుమంతరావు, న్యాపతి సుబ్బారావు పంతులు – ఇలా రాజమహేంద్రవరం వారేకాక దేశమందు అన్ని ప్రాంతాలవారు కలసి షష్టిపూర్తి సన్మాన సంఘంగా ఏర్పడటం చాలా విశేషం. చిలకమర్తి సంపుటాలు రాజమహేంద్రవరంలో సుజనరంజనీ ముద్రాక్షరశాలాధిపతియైన పోలాప్రగడ శేషగిరిరావు ముద్రించటానికి అంగీకరించారు పది సంపుటాలకు కావలసిన కాగితం షష్టిపూర్తి సంఘం ఇచ్చేటట్లు అంగీకరించారు. ముద్రణ సొమ్ము కూడా సంఘం వారిచ్చేందుకు అంగీకరించారు. సంపుటాలు ముద్రణ ఆలస్యమవటంలో షష్టిపూర్తి సభ కొంత ఆలస్యమయింది.

1927 సెప్టెంబరు 26 నాటికి చిలకమర్తికి అరవైఏళ్ళు నిండుతాయి. కానీ 1928, మార్చి 11 తారీఖున టవునుహాలు వెనుకవున్న ఆవరణలో షష్టిపూర్తి మహోత్సవం జరిగింది. కాశీనాధుని నాగేశ్వరరావుగారు సభకి అధ్యక్షత వహించారు. చిలకమర్తివారి స్నేహితుడైన వేమూరి విశ్వనాధ శర్మగారు మిత్రులందరికీ విందు చేసారు. మోటారు బండిలో కూర్చోపెట్టి, చిలకమర్తిని మంగళవాద్యాలతో నూరేగించారు. కారులో ఒకపక్క న్యాపతి సుబ్బారావుగారు, రెండవప్రక్క కాశీనాధుని నాగేశ్వరరావుగారు కూర్చున్నారు. ఆ సభలోనే 10 సంపుటాలు షష్టిపూర్తి సంఘంవారు చిలకమర్తికి బహూకరించారు. రాజమహేంద్రవరంలో షష్టిపూర్తి ఉత్సవం జరగటం అదే మొదలు. చిలకమర్తి షష్టిపూర్తి మహోత్సవం జయప్రదంగా జరిగింది.

1943 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు చిలకమర్తి వారికి 'కళాప్రపూర్ణ' బిరుదము -నిచ్చారు. అయితే చిలకమర్తి అనారోగ్యంతో సభకు వెళ్ళలేకపోయినా, బిరుద ప్రధానం జరిగింది.

చిలకమర్తి స్వీయ చరిత్రలో సాహిత్య రచనకి సంబంధించని అంశాలు చాలా వున్నాయి. అవన్నీ ఆనాటి సాంఘిక స్థితిగతులకి అద్దం పడతాయి. చిలకమర్తి స్వీయచరిత్రలో ఎన్నెన్నో విశేషాలు నేటికీ ఆసక్తిదాయకంగా వుండటం విశేషం.

చిలకమర్తి ఆధునికాంధ్ర యుగ పురుషులలో ఒకరు. వారి జీవితమంతా సారస్వత గోష్ఠిగా జరిగింది. చిలకమర్తి లాంటి మహనీయుని స్వీయచరిత్ర తరతరాల యువతకు స్ఫూర్తిదాయకమే.

★ ★ ★

# చిలకమర్తి - పద్యరచన

చిలకమర్తి సాహిత్యసృష్టి పద్యరచనతోనే ఆరంభమైంది. చిలకమర్తి అనగానే నాటకకర్త, నవలాకారుడు, ప్రహసనకర్త అంటాంగానీ పద్యకర్తగా లోకానికి పరిచితుడు కాలేదు. నాటకపద్యాలు లోకాన్ని రంజింపచేసినా, చిలకమర్తి ఆశువుగా చెప్పిన పద్యాలెన్నో వున్నాయి. స్వీయచరిత్ర ఆధారంగా అవి తెలుస్తాయి.

చిలకమర్తి కవిగా ఎలా గుర్తింపు పొందాడో ఆయనే చెప్పారు. "నా కవిత్వమును గూర్చి యొక్కమాట నిచ్చట చెప్పెదను. చిన్ననాడు నేను వీరవాసరములో చదువుకొనుచున్నప్పుడు, నా మిత్రుడు చెన్నాప్రగడ భానుమూర్తిగారు నాకంటె పై తరగతిలో చదువుచు, అప్పుడే కవిత్వము చెప్పనారంభించెను. నేను నరసాపురములో మిషనుస్కూలులో చదువునపుడు ఏలేశ్వరపు వేంకటప్పయ్య శాస్త్రిగారివద్ద ఛందోవిషయసార సంగ్రహమను లక్షణ గ్రంథమును చదివితిని. అందుచేతనే గొంత లక్షణము నేర్చితిని. రాజమహేంద్రవరము వచ్చిన తరువాత దీనిని కొంత వృద్ధి చేసుకొంటిని. ఈ విధముగ నేను కవిత్వములో వ్రేలుపెట్టితిని. మా గురువుగారిమీద నేను రచించిన పద్యములలో నా పేరు బైటపడెను. నేను కవిననియు, నాంధ్రభాషా పరిచితుడననియు గొందరికప్పుడు తెలిసెను." (స్వీయచరిత్ర - 120.)

1887లో విక్టోరియా రాణి స్వర్ణోత్సవము జరిగింది. చిలకమర్తి ఆ సభలో చదువుదామని పద్యాలు రాసారు. కానీ చదవలేదు. రెండోసారి జరిగిన సభలో కూడా చిలకమర్తి పద్యాలు రాసారు. కానీ చిలకమర్తి పేరున కాకుండా అతని స్నేహితుని పేరున అవి చదవబడ్డాయి. ఆ పద్యాలు చాలా మంది ప్రశంసించారు.

వేదం వెంకట్రాయశాస్త్రిగారు రాజమహేంద్రవరం నుండి బి.యల్. చదవటానికి మద్రాసు వెళ్ళేప్పుడు, పాతవిద్యార్థులు ఏర్పాటు చేసిన సన్మానసభలో ఐదుపద్యాలు రచించి చదివారు చిలకమర్తి. సభలో పద్యాలు చదవటం చిలకమర్తికి అదే మొదలు.

చిలమర్తి ఆ తర్వాత చాలా పద్యాలు ఆశువుగా చాలా సందర్భాలలో చెప్పారు. టంగుటూరి ప్రకాశమంటే చిలకమర్తికి చాలా యిష్టం. చిలకమర్తి నాటకాలలో చాలా వాటిల్లో చాలా వేషాలు వేశారు ప్రకాశంగారు. ప్రకాశంగారు మెట్రిక్ పరీక్షలో కృతార్థులైనపుడు చిలకమర్తి రెండు రూపాయల చీనీమిఠాయి తెప్పించి మిత్రులకి పంచిపెట్టారు. ఒకసారి హనుమంతరావు నాయుడుగారు, చిలకమర్తి, ప్రకాశం కలసి జనార్దనస్వామి తిరునాళ్ళకి వెళ్ళారు. ధవళేశ్వరం వెళ్ళాక, స్నేహితులంతా కూచున్నాక ప్రకాశంపై ఒక పద్యం చెప్పారు చిలకమర్తి.

సీ॥ ఈగవాలినగాని వేగ జారెడునట్లు
మువ్వంపు కురులను దువ్వినాడు
వర లలాటమునందు తిరుచూర్ణ రేఖను
ముద్దుగారెడుభంగి దిద్దినాడు
అరుణపల్లవమట్లు కరము రంజిల్లు చెం
గావి వస్త్రంబు గట్టినాడు
చారలంగ ఖారను చక్కగా ధరియించి
వల్లెవాటు కండువవైచినాడు

– ఇలా వర్ణించి, సీసపద్యం కింద తేటగీతి రాసారు. ఓ సాయంత్రం స్నేహితులంతా కూచున్నాక హనుమంతరావు నాయుడు గారు పకోడీలు తెప్పించారు. చిలకమర్తిని అక్కడివారు పకోడీలపై పద్యాలు చెప్పమన్నారు. "కవులకు అక్షరలక్షలిచ్చెడి కాలము గతించినది. పద్యమునకు పకోడీ నిచ్చెడి దుర్దినములు వచ్చినవి" అని హాస్యోక్తి విసరి, పకోడీ పద్యాలు చెప్పారు చిలకమర్తి.

కం॥1. వనితల పలుకుల యందున
ననిమిషలోకమున నున్నదమృతమటంచున్
జనులనుటంగాని లేదట
కనుగొన నీయందమృతము గలదు పకోడీ!

కం॥2. ఆకమ్మదనము నారుచి
యాకరకర యాఘుమఘుమ మాపొంకములా
రాకలు పోకలు వడుపులు
నీకేదగు నెందులేవు నిజము పకోడీ!

కం॥3. నీకరకర నాదంబులు
మాకర్ణామృతములు నీదుమహితాకృతియే
మాకనుల చందమామగ
నేకొనియాడెదను సుమ్ము నిన్ను పకోడీ!

కం॥4. ఎందుకు పరమాన్నంబులు
ఎందుకు పలుపిండివంటలెల్లను హా! నీ
ముందర దిగదుడుపునకవి
యందును సందియము కలుగదరయ పకోడీ!

కం॥5. ఆరామానుజు డాగతి
పోరునమూర్ఛిల్ల దెచ్చె మును సంజీవిన్
మారుతి ఎరుగడుగాక య
య్యారె నిను గొనిన బ్రతుకడటవె పకోడీ!

కం॥6. పురహరుడు నిన్ను దినునెడ
కరుగదె యొక వన్నెనలుపు గళమున మరిచం
దురుడున్ దినిన కళంకము
గరుగక యిన్నాళ్ళు యుండగలదె పకోడీ!

కం॥7. కోడినిదినుటకు సెలవున్
వేడిరిమున్ను బ్రాహ్మణులు వేద నతండున్
కోడివల దాబదులు ప
కోడిందిను మనుచు జెప్పెకూర్మి పకోడీ!

ఇంకా పకోడీపై చెప్పిన పద్యాలు చాలా వున్నాయి కాని చిలకమర్తి వారికి జ్ఞాపకం లేకపోబట్టి గ్రంథస్థం చేయలేకపోయారు.

ఆశు కవితలో కందపద్యం చెప్పడం ప్రత్యేకత కందం చెప్పినవాడే కవి అనే మాట రూఢి చేసారు.

చిలకమర్తి వివాహం 1893 లో చిన్న తిరుపతిలో అయింది తిరుపతి క్షేత్రాన్ని, వేంకటేశ్వర స్వామిని గూర్చి కొన్ని పద్యాలు చెప్పారు

సీ॥ ఆలబోతుల దెచ్చి యచ్చుబోసెడివారు
నిలువుదోపుల నిచ్చి నిలుచువారు
డిబ్బీల యందున డబ్బు వేసెడివారు
సాష్టాంగదండముల్ సలుపువారు
వడుగులు పెండ్లిండ్లు వరుస జేసెడివారు
చెలువుగా భజనలు చేయువారు
వేంకటేశ్వర యంచు వినుతి జేసెడివారు
తివిరి ప్రదక్షిణల్ తిరుగువారు

గీ॥ ముడుపుల సమర్పణము జేసి మ్రొక్కువారు
కొండపై నెక్కజాలక కుందువారు
ఈశ్వర ప్రసాదమును భక్షించువారు
కలగి కలకలలాడెడు దేవళము నేడు.

చం॥ ముడుపుల నీయకున్న యతిమూర్ఖుల బెత్తముతోడగొట్టి నీ
ముడుపుల దెచ్చికొందువని భూజనులాడెదరట్టి నీవు నీ
గుడినడిరేయిజొచ్చి ధనకోశము మ్రుచ్చిలు దొంగవాండ్ర నీ
వడపకపోతివయ్య, మహత్వమే! చెప్పుము వేంకటేశ్వరా?

ఇలా ఐదు పద్యాలు రచించారు. బీబీ నాంచారి అనే తురక స్త్రీని పెళ్ళాడినా, వర్ణ సంకరుడవైనా, అన్ని కులాలవాళ్ళూ అదేమీ పట్టించుకోకుండా వందనము చేస్తున్నారు అన్నారు.

1895 లో కాకినాడలో జరిగిన గోదావరి మండల సభలో చిలకమర్తి పద్యాలుగు పద్యాలు చదివారు. అవి చదివినపుడంతా సభ్యులు చప్పట్లు చరిచారు. దాంతో చిలకమర్తి పేరు గోదావరి మండలమంతా వ్యాపించింది. సాధారణంగా ఎవరి కవిత్వమూ మెచ్చుకోని వీరేశలింగం గారు చిలకమర్తి వారి పద్యాలు బాగున్నాయని మెచ్చుకున్నారు (స్వీయచరిత్ర– 196).

చిలకమర్తి చదివిన ఆ పద్యాల్లో ఆంగ్లేయ దొరతనాన్ని ముందు ప్రశంసించారు. కొన్ని పద్యాలలో ఆంగ్లేయ ప్రభుత్వంలోని లోపాలను చూపారు

సీ॥ పన్నుగట్టుట యందు ప్రభువులే ప్రాణుల
కేనాటి కైనను దృష్టిలేదు
ఉద్యోగములు చేయు ఉన్మత్తులకు గార్య
నిర్వాహమందున నియతిలేదు

– ఇలా చెప్పుకొంటూ వెళ్ళి చివర తేటగీతి పద్యంలో

"తెలుగు తెలియంగ దొరలకు తెలివి లేదు
దీన దశ బాపగల యట్టి దిక్కు లేదు
కటకటా! యెట్టులున్నదో కాపుల దశ
సుగుణ ధనులార జనులార చూడరయ్య!"

అంటూ తమ కష్టాలు చెప్పుకొనేందుకు రైతులకు విద్య లేదు అన్నారు. ఈ పద్యాలు చాలా ప్రచారంలో కొచ్చాయి. ఆ సభ పూర్తి అయ్యాక న్యాపతి సుబ్బారావు గారు, కృత్తివెంటి పేర్రాజుగారు భోజన సమయంలో చిలకమర్తి చేత ఆ పద్యాలు మళ్ళీ చదివించుకొని విన్నారు. "నాలుగవనాడు నేను రాజమహేంద్రవరము వెళ్ళుచుండగా కాకినాడ వీధులలో గొందరు మనుష్యులు నన్ను వ్రేలితో చూపి, నిన్న పద్యములు చదివినవారు వీరే అని ఒకరితో ఒకరు చెప్పుకొన్నారని" తెల్పారు.

ఈ పద్యాలలో విశేషం మరొకటుంది. ఇటువంటి పద్యాలు దొరతనంవారి గూర్చి రాస్తే వారు నీకు రావుబహదూర్ బిరుద మిస్తారని ఒక మిత్రుడు చిలకమర్తితో చమత్కరించారు. అంతేకాక, ఆ పద్యాలు చాలా బాగున్నాయని న్యాపతి సుబ్బారావుగారు వాటిని విజయనగరం పంపి, అక్కడ కళాశాలలో ఆంగ్లేయ భాషా పండితుడైన గురజాడ అప్పారావు గారి చేత ఇంగ్లీషులోకి అనువాదం చేయించారు. ఆ పద్యాలు చాలా బాగున్నాయని చిలకమర్తి తండ్రి ఆ ఊరిలోని వారందరినీ పిలిచి వినిపించాడు (స్వీయచరిత్ర– 216).

1897 లో విక్టోరియా రాణి పరిపాలన అరవై ఏళ్ళు పూర్తయింది. వజ్రోత్సవ సందర్భంగా ఎన్నో సభలు జరిగాయి. రాజమహేంద్రవరంలో జరిగిన సభలో చిలకమర్తి కొన్ని పద్యాలు చదివారు.

సీ॥ ఏ మహాదేవి మహీపాలనము మాట
స్రుక్కెడు ప్రజలకెల్ల జోలపాట
యే జగద్వందిత యేల్బడి మనకెల్ల
చిరతనానందంపు చిత్తజల్లు
బహుపుత్రపౌత్ర లాభస్ఫూర్తి గన్నయే
గరికమిన్న కడుపు కందపెరడు
కుటిల మత్తారాణి కోటి కేసరి జయ
భేరి భీకరణంబు పిల్లపిడుగు

చంద్రపాల్ చెన్నపురి రాజధానిలో రాజకీయోపన్యాస మివ్వాలని, కలకత్తా నుండి బయలుదేరి బరంపురం, విశాఖపట్నం మీదుగా రాజమహేంద్రవరం వచ్చారు వీరు వచ్చి మొట్టమొదట ఇన్నిసుపేటలో ఉపన్యసించారు. ఆ భాగానికి పాల్ చౌక్ అని పేరు వచ్చింది. టవునుహాలు ఆవరణలో వరుసగా ఐదు రోజులు సభలు జరిగాయి. అన్ని రోజులు బ్రిటిష్ వర్యను ఖండిస్తూ ఇంగ్లీషులో గంభీరంగా ఉపన్యసించారు బిపిన్ చంద్రపాల్. "శ్రీకృష్ణుని గానము విని మోడులు చిగురించునట్లు, రాళ్ళు స్రవించినట్లు బిపిన చంద్రపాలుగారి ఉపన్యాసము విని జనులు ఉద్రేకపూరితు లయ్యా"రని చెప్పారు చిలకమర్తి. ఇంగ్లీషు రాని ప్రజలు ఉపన్యాసం వినడానికొచ్చినవారు వేలకు వేలున్నారు. బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసం తెలుగులో చెప్పమని అంతా చిలకమర్తిని కోరారు. ఉపన్యాసం చెప్తునపుడే మనసులో ధారణ చేసుకొని తెలుగులో చెప్పారు చిలకమర్తి ఐదవ రోజున, చిలకమర్తి మనసులో ఊహించుకొని చెప్పారు ఒక పద్యం –

*తే॥ భరతఖండంబు చక్కని పాడియావు*
*హిందువులు లేగదూడలై యేడ్చుచుండ*
*తెల్లవారను గడుసరిగొల్లవారు*
*పితుకుచున్నారు మూతులు బిగియకట్టి.*

ఈ పద్యం విని సభాసదులు సంతోష పారవశ్యంలో బ్రహ్మాండము పగిలేట్లుగా చప్పట్లు కొట్టారు. మళ్ళా మళ్ళా ఆ పద్యాన్ని చదవమని ఎందరో వచ్చి చిలకమర్తిని కోరారు. కంఠస్థం చేసారు చాలామంది. ఆ పద్యం కృష్ణానది గోడమీద పెన్సిళ్ళతో రాయబడింది. ఈ పద్యం ఆంధ్రదేశము అంతటా వ్యాపించింది. గోదావరీ మండల సభాపద్యాలతో పాటు, ఈ పద్యం హరికథలలోకి కూడా ఎక్కింది.

ఇది దేశభక్తి గీతంగా పాడుకున్నారు చాలామంది. చిలకమర్తి దేశభక్తికి, ఆశుకవి తాభి వ్యక్తికి ఈ పద్యం నిదర్శనం. చిలకమర్తి గయోపాఖ్యాన మెంతటి పేరు తెచ్చుకుందో, ఈ ఒక్క పద్యం అంతటి పేరు తెచ్చుకొని, చిలకమర్తికి గొప్ప కీర్తి తెచ్చిపెట్టింది

హితకారిణీ సమాజం 1906 లో స్థాపింపబడినా, 1908 వరకు దానిని రిజిష్టరు చేయించలేదు. 1908 లో దేశరాజు పెద్ద బాపయ్యగారు మద్రాసులో మరణించారు. ఆయన బ్రహ్మసమాజవాది. గొప్ప సంఘ సంస్కర్త. వీరేశలింగం గారి కుడి భుజం. వారి మరణం తీరని లోటే. బాపయ్యగారి చిత్రపఠాన్ని టవునుహాలులో పెట్టించాలని వీరేశలింగంగారు సిద్ధం చేయించారు. ఆ చిత్రపటాన్ని ఆవిష్కరించటానికి ఎవరైనా పెద్దలను ఆహ్వానించాలనుకుంటుండగా, వీరేశలింగంగారు ఆ చిత్రపటావిష్కరణకి చిలకమర్తిని కోరారు. ఆ సభలో చాలామంది బాపయ్యగారి గుణగణాలను కీర్తించారు. ఆ సభలో చిలకమర్తి బాపయ్యగారిపై తొమ్మిది పద్యాలు రాసి చదివారు.

*మ॥ అకటా! పోయితె దేశరాజకులదీపాంకురమా! సద్గురు*
*ప్రకరా! బ్రహ్మసమాజమందిర మహాభారోద్వహస్తంభమా!*
*సకలార్యస్తవనీయవర్తన! సదాచార ప్రియా, ధీవరా!*
*యకలంకాత్మక! సత్యవాక్యరత! బాపయ్యా! సుహృద్రత్నమా!*

శా॥ ఎంతో శాంతము బూడిదయ్యె పదువెంతో నేలపాలయ్యె నెం
తెంతో మంచితనంబు దగ్ధమయిపోయెం దెల్లనెంతో గుణం
బెంతో యీశ్వరభక్తి డొగ్గులయిపోయెన్ నాదు నీతో వ్రతా
నాంతర్యాముల నెంత నష్టమిది బాపయ్యా, సుబ్రహ్మణ్యమా!

ఈ పద్యాలు సత్యవాది పత్రికలో ప్రకటింపబడ్డాయి

చిలకమర్తి దేశభక్తి పూరిత పద్యాలు చాలా సందర్భాలలో రాశారు 1907 లో దొరతనం వాళ్ళు దేశాభిమాని, మహాపురుషుడు అయిన లాలా లజపతి రాయ్‌ని పట్టుకొన్నారు నిష్కారణంగా పట్టుకొని బర్మాకు తీసుకెళ్ళి మాండలే నగరంలో చెరసాలలో బంధించారు దీనిమూలంగా భారతదేశమంతా సంక్షోభపడింది. విశాఖపట్నంలో మొట్టమొదటగా తీర్మానం జరిగింది. ఆ సభలో లాలా లజపతిరాయ్‌ను మాండలే చెరసాలకు పంపినందుకు నిరసనగా బ్రిటిష్ చర్యను ఖండించటం జరిగింది ఆ తీర్మానాన్ని తెలుగులో అనువదించి మాట్లాడారు చిలకమర్తి. ఆ ఉపన్యాసాన్ని గురించి “I heard your soul stirring speech with pleasure” అని శ్రీనివాసరావుగారు చిలకమర్తి చెయ్యి పట్టుకొని అన్నారు. ఆ ఉపన్యాస ప్రభావం యువకులను చాలా ఉత్తేజపరిచింది.

రాజమహేంద్రవరంలో చిలకమర్తి లాలా లజపతిరాయ్ ప్రవాసాన్ని గురించి పద్యాలు రాశారు.

మ॥ “చెరశాలల్ పృథుచంద్రశాలలెయగున్ చేదోయిగీలించు న
య్యరదండల్ విరిదండలయ్యెడును హేయంబైన చోడంబలె
పరమాన్నంబగు మోటకంబళులు దాల్పన్ పట్టుసెల్లాలగున్
స్థిరుడై యేనరుడాత్మ దేశమును భక్తింగొల్చు నవ్వానికిన్

తే॥ భరతఖండంబె యొక గొప్పబందిఖాన
అందులోనున్న ఖయిదీలు హిందుజనులు
ఒక్కగదినుండి మార్చి వేరొక్కగదికి
బెట్టుటేగాక చెరయంచు వేరె గలదె”

చిలకమర్తి చెప్పిన పద్యాలెన్నో వున్నాయి. కందుకూరి వీరేశలింగంగారు చిలకమర్తికి గురువు, దైవసమానుడు. వీరేశలింగంగారిపై చెప్పిన పద్యము హితకారిణీ పాఠశాలలోని ఫలకంపై శాశ్వతంగా నిలిచింది.

తనదేహము తనగేహము
తనకాలము తనధనమ్ము తనవిద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా!

చిలకమర్తి వారి పద్యరచన గురించి ఎంత చెప్పినా చాలదు. చిలకమర్తి వారి సాహిత్యమంతా ప్రజల్లో ఇంత ప్రచారం పొందటానికి ముఖ్య కారణం ఆయన పద్యరచనే

★ ★ ★

# శతకాలు

చిలకమర్తి మూడు శతకాలు రచించారు. గీతమంజరి, కృపాంభోనిధి, భల్లటశతకము. గీతమంజరి బాలల నుద్దేశించి రచింపబడిన నీతి శతకం. గీతమంజరి పీఠిక (20–6–1931) "ఇందలి ప్రతి పద్యమున నేదో యొక దృష్టాంతము చూపబడినది. అన్నియూ గీతపద్యము లగుటచే 'గీతమంజరి' అని పేరు పెట్టితిని. ఇందలి పద్యములు బాలురు సులభముగా చదువుటకు, జ్ఞాపకముంచుకొనుటకు, అనుకూలముగా నుండునట్లు సులభశైలిలో వ్రాయబడినవి" అన్నారు చిలకమర్తి.

తెల్లవారి లేచి పిల్లలు భగవంతుని ధ్యానించాలని ప్రబోధించే సందర్భంలో ఎంతో సరళంగా సులభగ్రాహ్యంగా వున్న పద్యం రాశారు చిలకమర్తి.

"కావుకావంచు మనుజుడు దేవదేవు
వేకువను వేడుకొనకుంట విస్మయంబు
క్షుద్ర జంతువు కాకియు నిద్ర లేచి
కావుకావంచు నఱచును గాదె మొదట"

పిల్లలు రోజూ చూసే కాకిని గురించి చెప్తూ చక్కని నీతిబోధచేయటం గీతమంజరిలోని విశేషం.

గీతమంజరిలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగంలో 119 పద్యాలు, ద్వితీయ భాగంలో 109 పద్యాలు ఉన్నాయి. ఇవి మకుటంలేని శతకాలలాంటివనే చెప్పాలి. అప్పటి ప్రభుత్వంవారి పాఠ్యపుస్తక నిర్ణాయక సంఘం 1931 లో దీనిని ఇంగ్లీషు నేర్పే పాఠశాలల్లో 1,2,3 ఫారాలు చదివే విద్యార్థుల ఉపయోగార్థం నియోగించింది. 1931 లో వావిళ్ళ వారు ఈ గ్రంథాన్ని ప్రచురించారు.

మొదటిభాగం దినచర్యతో మొదలై సాధువర్తనాన్ని చెప్పే నీతులతో కొనసాగింది. రెండవ భాగం లోకవృత్తాన్ని ఆశ్రయించి నీతిని బోధించే పద్ధతి నాశ్రయించింది. సమకాలీన సాంఘిక దృష్టాంతాన్ని చూపి నీతిని బోధించే విధానంలో చాలా పద్యాలు రాసారు చిలకమర్తి.

*దైవమొకవేళ నన్యథా తలచునేని
మానవ ప్రయత్నంబులు మంటిపాలు
అంత నాగరకతగల యాజపాను
ప్రళయమొందదె భూమికంపంబుచేత*

పిల్లలకు అర్థమయేట్లు నీతి చెప్పటమనేది ఒక ప్రత్యేకతే. అందులో చిలకమర్తి సిద్ధహస్తుడు.

సద్గురులు చేయునుపదేశ సారములను
నెంత యజ్ఞానమైనను నిట్టె పోవు
మంచి వైద్యుడిచ్చెడి చిన్ని మాత్రచేత
దారుణంబగు రోగంబు తొలగునట్లు

ఈ గీతమంజరి ఉత్తమ మార్గాన పోసి గమ్యస్థానం చేరటం అనే సందేశంతో ముగియటం ఔచిత్యం

సరియయిన మార్గమును బట్టి సంచలించు
నతడు చేరు గమ్యస్థానమశ్రమమున
ఇనుపపట్టీలపై నుండి యేగునట్టి
ధూమ శకటంబు వలె శ్రేణి తొలగకుండ

గీతమంజరి విద్యార్థుల పాలిట నీతిమంజరే!

చిలకమర్తివారి "కృపాంభోనిధి" లో మకుటంగల పద్యాలు 213 వున్నాయి. చిలకమర్తి దాదాపు 70 పద్యాలు "దీనకల్పద్రుమా" అనే మకుటంతో 1916లో మనోరమ పత్రికలో ప్రకటించారు. వాటినే కృపాంభోనిధీ మకుటాంతాలుగా మార్చి ఈ శతకంలో దాదాపు 15 సంవత్సరాలల్లో (1916 నుండి 1930 వరకు) చిలకమర్తి వారు మనోవేదనతో అప్పుడప్పుడు రాసుకున్న పద్యాలున్నాయి. ఈ శతకం రామమోహనరాయల వారి శతాబ్దోత్సవ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రకటింపబడింది. బ్రహ్మమతాభిమానం గల పంతులుగారు తన్మతానుకూలమైన భావసముదాయాన్ని పద్యగుచ్ఛాలుగా సంతరించారు. ఇందులో మొదటి రెండు భగవదారాధనకు సంబంధించినవి. రామమోహన పంచకం వరకు గురుస్మరణం, కీర్తనం వంటిది. చివరది శాంతి వాచకం. కీర్తిశేషురాలైన చిలకమర్తి వారి భార్యను గూర్చి అనుతాపాన్ని వ్యక్తం చేస్తూ ఆమెకు ఆత్మశాంతిని ప్రసాదించమని భగవంతున్ని ప్రార్థించే పద్యాలు వున్నాయి.

"అలుకం బూనవు మమ్ము వెట్టిపని సేయంబంపి నంతఃపురం
బులలో నుండవు, మొత్తులన్వినెదు గొల్వుందీర్చి, హ్రుత్ప్రీరి గో
లల గొట్టింపవు, పన్నులిమ్మనవు, మేల్గావించి రక్షింతు, నీ
వలె బాలించు ప్రభుండు సేకురునె దేవా సత్కృపాంభోనిధీ!

చిలకమర్తికి ప్రభువంటే దేవుడే. స్వచ్ఛమైన భక్తి విజ్ఞానముతో పుష్పములచే భగవంతుని ఆరాధించుట తగునని చిలకమర్తి కవి ఈ శతకంలో చాటారు ఉదాత్తమైన నైతిక జీవనమునకు నిష్కల్మషమైన చిత్తవృత్తి పంచేంద్రియములను స్వాధీనపరచుకొనుట అవసరమని, సూదిమొనయంత రంధ్ర మేర్పడినను ఓడ మునిగిపోవునట్లు మానవుడు స్వల్పదోషమొనర్చినను సర్వనాశనము తప్పదని వారు హెచ్చరించెను.

ఈ శతకంలో పద్యరచన భావానుకూలంగా ప్రసరించే ఛందోవాహినిలా కనబడతాయి. ఉదాహరణకు, స్తుతిపద్యం

జయ, కల్యాణగుణాలవాల, జయ, విశ్వశ్రేయ సంధాయ, హే
జయ, యోగీంద్రమనోనివేశ, జయ, దోషధ్వాంత మార్తాండ,
జయ, సర్వాంతర బాహ్యావాస, జయ, నిష్కామ క్రియాలోల, హే
జయ, మోక్షప్రద, సత్యరూప, జయ, హేశంభో, కృపాంభోనిధే!

ఇది తెలుగు పద్యమూ అవుతుంది, సంస్కృత శ్లోకమూ అవుతుంది స్తుతి పద్యాలలో నామసంకీర్తనం ఒక పద్ధతి. అవాఙ్మానస గోచరమైన బ్రహ్మన్ని అన్నీ అకారంతో ప్రారంభమయ్యే విశేషణాలతో కీర్తించటం ఒక చమత్కారం

శాంతివచనం ఒక విధంగా స్మృతి రచన చిలకమర్తి భార్య వెంకాయమ్మ 1930లో గుండెపోటుతో మరణించింది. ఆమె మరణాన్ని గూర్చి "ఆమె నాతో ముప్పది రెండు వర్షములు గాపురము చేసెను. నా యింట నెందరో బంధువులు, వారములు చేసికొని తిను విద్యార్థులు, చాలామంది యుండిననూ, నా భార్య విసుగు గొనక, చికాకు పడక, మడికట్టుకొని వంటజేసి, అందరను నిష్పక్షపాతముగ భోజనములు పెట్టి యాదరించు చుండెను. ఆమె మరణము చేత నేనసహాయుడనైతిని" అన్నారు (స్వీయచరిత్ర – 577). ఆమె ఎడబాటు భరించలేకపోయిన చిలకమర్తి ఆమె ఆత్మశాంతికై పద్యాలు రాసారు.

అనుగై యెప్పుడు తోడునీడ యయి కన్నై చేయియై ప్రాణమై
నను సేవించె ననేకవర్షములు, గానన్ నేమ్మనం బెంతయున్
వనటం జెందెదు, దుఃఖవారిధి తరింప న్నాకు ధైర్యంబు ప్రీ
తిని జేకూరిచి ఆమె యాత్మకిదు శాంతిన్ సత్కృపాంభోనిధీ!

ఆర్తినుండి ఆత్మశాంతి వరకు సాగే ప్రస్థానాన్ని ఈ పద్యాలలో చిత్రించారు చిలకమర్తి. ఆధునిక భక్తి శతకాలలో ఒక స్థానం సంపాదించుకుంది కృపాంభోనిధీ శతకం. ఈ శతకాన్ని రఘుపతి వేంకటరత్నం నాయుడుగారు అచ్చు వేయించారు.

చిలకమర్తివారి భల్లటశతకం భావానువాద ప్రక్రియలో నడిచిన అనువాదం. చిలకమర్తి వారు అనువాదం చేసినా సొంత రచనలా హృదయం నుండి భావావేశంతో ధారామధురంగా కవిత వెలువడుతుంది.

చిలకమర్తి శతక రచనలో సిద్ధహస్తునిగా గౌరవింపబడ్డారు.

★ ★ ★

# చిలకమర్తి - పాఠశాలలు

చిలకమర్తి ఉపాధ్యాయ వృత్తికి యోగ్యత [illegible] లిఖిత పరీక్షలో మొదటి తరగతిలో కృతార్థులయినా, ప్రాక్టికల్స్‌లో సంపూర్ణ యోగ్యత సంపాదించలేకపోయారు. దృష్టిదోషమే లోపమని అయినా భావించలేదు

"నా దృష్టి దోషము యుపాధ్యాయ పదవికెంత మాత్రము నడ్డురాలేదు నేను పాఠము చెప్పునపుడు మాత్రము గోలయు అల్లరియు లేకుండ తరగతి నిశ్శబ్దముగానే యుండుచు వచ్చెను నా బోధనాశక్తి మిక్కిలి బాగుండెడిది. విద్యార్థులలో నాకు మంచి పేరుండెడిది. పాఠక మహాశయులు దీనిని ఆత్మస్తుతిగ గ్రహింపకుండుదురుగాక!" అన్నారు.

చిలకమర్తి మున్సిపల్ పాఠశాలలో మూడు సంవత్సరాల నాలుగు నెలలు పని చేశారు. అంతలో పోలవరము జమీందారుగారు ఉద్యోగం మానేసి సరస్వతి మాసపత్రిక నడుపుమని, నెలకు ముప్పై రూపాయలు జీతమిస్తానని తెలియజేశారు. దాంతో చిలకమర్తి ఉద్యోగానికి రాజీనామా చేయటం జరిగింది.

జమీందారు తనని కనిపెట్టి చూస్తున్నా, తన పోషణ నిమిత్తం ఒక పాఠశాల స్థాపించాలని నిశ్చయించుకున్నారు. స్నేహితుల దగ్గర రెండువందలు అప్పు పుచ్చుకొని బల్లలు, కుర్చీలు చేయించారు ఆ పాఠశాల 1899 జనవరిలో ప్రారంభించారు. నాలుగవ తరగతి వరకు బాలురు చేరారు. సరస్వతీ పత్రిక, పాఠశాల రెండూ కొంతకాలం బాగా నడిచాయి. అయితే జమీందారుగారు పత్రికని కాకినాడ నుంచి నడపాలనుకొనటంతో చిలకమర్తికి ఇబ్బంది వచ్చింది. పాఠశాలపై వచ్చే డబ్బుతో మాత్రమే జీతాలివ్వటం, ఇంటిఅద్దె యివ్వటం, రోజు గడుపుకోటం చాలా కష్టమయిపోయింది.

అయినా పాఠశాలపై ఆసక్తి తగ్గక 1901 నాటికి పాఠశాలలో మూడవ ఫారము పెట్టారు. ఆ పాఠశాల ప్రధానోపాధ్యాయుడు. ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణుడై బోధనాభ్యసనము పొందినవాడై వుండాలి. జీతము తీసికోకుండ, బాధ్యతగా పనిచేయటానికి సత్యవోలు లక్ష్మీపతిగారనే భాగ్యవంతుడు, అనుభవజ్ఞుడు అంగీకరించారు. ఆ సంవత్సరమే లోయర్ సెకండరీ పాఠశాలగా విద్యాశాఖవారి అనుమతి పొందింది ఆ పాఠశాల. ఇందులో విద్యార్థులు చాలామంది బీదవారవటంతో కొందరు జీతము కట్టకుండానూ, కొందరు సగంజీతం కట్టి చదువుకొన్నారు.

చిలకమర్తి 1902లో ఉన్నత పాఠశాల స్థాపించారు. దీనివలన నిరుద్యోగ సమస్య తీరుతుందని విశ్వసించారు అయినా కొత్త పాఠశాలతోపాటు కొత్త సమస్యలు చిలకమర్తికి ఎదురయ్యాయి. ఉన్నత పాఠశాల పట్నంలో వుంటే బోధనాభ్యసన

కళాశాలకి నష్టం కలుగుతుందని పరీక్షాధికారులు భావించటంతో, నాల్గవ ఫారము తీసేయాలని, అలా చేయకపోతే, ఇంతకు ముందిచ్చిన సెకండరీ పాఠశాల సమ్మతి రద్దుచేస్తామన్నారు. ఆ పరిస్థితులలో చిలకమర్తి ఆ దొరల ధాటికి తట్టుకోలేక "నేను నల్లనివాడను. హిందువుడను. విద్యానిబంధనల ప్రకారము పాఠశాల నడుపుచున్నాను నా పాఠశాల గతి వేరయ్యెను" (స్వీయచరిత్ర - 344) అని వాపోయారు. తన పాఠశాలలోని విద్యార్థులను హంట్ దొర కళాశాలలో పై తరగతులలో చేర్చారు ఆ విధంగా చిలకమర్తివారి ఉన్నత పాఠశాల వృత్తాంతం ముగిసింది

అయినా పాఠశాల స్థాపనపై ఉత్సాహం పోలేదు.

భీమవరంలో బోర్డు మిడిల్ స్కూలుంది. కానీ భీమవరంలోకానీ, ఆ దగ్గరలోకానీ ఉన్నత పాఠశాల లేదు ఆ తాలూకాలో విద్యార్థులు పై తరగతి చదవాలంటే నరసాపురం వెళ్ళాలి. కనుక ఉన్నత పాఠశాల భీమవరంలో స్థాపించాలనుకున్నారు చిలకమర్తి పాఠశాల స్థాపించారు కానీ, ఆ పుర ప్రముఖులకు ఆ పాఠశాలను వృద్ధిలోకి తేవాలని అనిపించకపోవటంతో చిలకమర్తికి నిరుత్సాహ మెదురైంది 1904 లో ఆ పాఠశాల ఎత్తివేశారు.

చిలకమర్తివారి హిందూ లోయర్ సెకండరీ పాఠశాలను వీరేశలింగంగారి కోరికపై వారికిచ్చేశారు. కందుకూరి వారు వితంతు శరణాలయం, నిమ్నజాతుల బాలబాలికల శరణాలయం స్థాపించాలనుకున్నారు. ఇన్నిట జీతాలివ్వటం కష్టం కనక, చిలకమర్తి లోవరు సెకండరీ పాఠశాలను తను తీసుకొని, దాన్ని ఉన్నత పాఠశాలగా చేస్తానన్నారు కందుకూరి. కానీ 1906 లో హితకారిణీ సమాజము స్థాపించి చిలకమర్తి వారి వద్ద నుండి తీసుకొన్న పాఠశాలను ఉన్నత పాఠశాలగా చేయాలన్న కందుకూరి ఆశయం నెరవేరలేదు. ఈ పాఠశాల ఉన్నత పాఠశాల చేస్తే, కళాశాలలోని ఉన్నత పాఠశాలకి దెబ్బ తగులుతుందని వ్యతిరేకించటం, హంటుదొర అంగీకరించరపోవటంతో ఆ లోవరు సెకండరీ పాఠశాల ఉన్నత పాఠశాల చేయటం కుదరలేదు. కనక చిలకమర్తి వారే తన పాఠశాలను నడుపుకొన్నారు. కానీ జీతాలివ్వటం కష్టంగా అనిపించటంతో, చివరికి హితకారిణీ సమాజ పక్షాన ఆ పాఠశాల కందుకూరివారే నడిపేటట్లు, జీతాలు వారే యిచ్చేటట్లు ఏర్పాటయింది. 1908లో అది ఉన్నత పాఠశాల అయింది.

దీంట్లో ఐదు, ఆరు ఫారాలు పెట్టి వీరేశలింగంగారు హితకారిణీ హైస్కూలు అని పేరుపెట్టారు. వీరేశలింగం మరణానంతరం హితకారిణీ హైస్కూలు పరిపాలనా సంఘంలో చిలకమర్తి సభ్యునిగ చేరారు.

చిలకమర్తి సంస్కరణలలో నిమ్నజాత్యుద్ధరణ ముఖ్యమైంది. "నిమ్నజాతుల యెడ నాకు మొదటి నుండియు సానుభూతి కలదు. వారు పడు కష్టములను కన్నులార చూచియు, చెవులార వినియు, పలుమార్లు జాలిపడుచుండెడివాడను. జన్మమెత్తినందుకు అటువంటి దుర్గతిలో వున్న సంఘమునకు నేదేని యుపకారము చేయగూడదా యని నా కప్పుడప్పుడు తట్టుచుండెను. వారి నిమిత్తమే ఒక పాఠశాల పెట్టిన బాగుండునని తోచినది" అని చిలకమర్తి తెలియజేశారు

1909లో నిమ్నజాతులకై ఒక పాఠశాల స్థాపించి, దానికి రామమోహన పాఠశాల

యని పేరు పెట్టారు. మొదట్లో కొద్దిమంది పిల్లలతో చాలా కష్టమయింది నడపటం – పిల్లలందరూ జీతము లేకుండా చదువువారే. పలకలు, పుస్తకములు చిలకమర్తివారే ఉచితంగా పిల్లలకిచ్చేవారు.

ఆ పాఠశాలను హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలగా మార్చారు చిలకమర్తి. పుస్తకాలపై వచ్చే రాబడితో పాఠశాల నడిపేవారు. పిఠాపురం రాజావారి సహాయం కొంత వుండేది. ఈ పాఠశాలను చిలకమర్తి పదమూడు సంవత్సరాలు నడిపారు. ఈ పాఠశాలకు ముందు నిమ్నజాత్యుద్ధరణకై ఎవరూ పాఠశాల నెలకొల్పలేదు!

పగలు పనిచేసి రాత్రి చదువుకొనేందుకు వీలుగా నిమ్నజాతులకై రాత్రి పాఠశాలను పెట్టారు చిలకమర్తి. అది వివేకానంద పాఠశాల. దానికొక పంచముని ఉపాధ్యాయునిగ నియమించారు. 1922 వరకు రామమోహన పాఠశాల, వివేకానంద పాఠశాల నడిపిన చిలకమర్తి ఆపైన నడపలేక విశ్వాసపాత్రుడైన శ్రీ గూడూరి రామచంద్ర రావుగారికి అప్పగించారు. ఆయన గాంధీగారి శిష్యుడు. గవర్నమెంటు గ్రాంటు పుచ్చుకోటం యిష్టంలేని రామచంద్రరావుగారు ఆ పాఠశాలలను జాతీయ పాఠశాలలుగా మార్చి ప్రభుత్వ సంబంధం వదులుకొన్నారు. దీనివలన అప్పటికే వున్న పిల్లలు పాఠశాల నుండి మానుకొన్నారు. కొత్తపిల్లలు చేరలేదు. ఆ విధంగా రెండు పాఠశాలలు మూసివేయబడ్డాయి.

చిలకమర్తి పాఠశాల స్థాపనలో, నిమ్నజాత్యోద్ధరణ విషయమై ముఖ్యాంశాలు కొన్ని వున్నాయి. రామమోహన పాఠశాలలో విద్యార్థిగా వున్న వెంకన్న అనే పంచముడు, స్కూలు ఫైనలు పరీక్ష పాసయ్యాక, రఘుపతి వేంకటరత్నంగారితో మాట్లాడి మహారాజావారితో మాట్లాడించి, కాకినాడలో బి.ఎ. వరకు అతను చదువునట్లు ఏర్పాటు చేశారు చిలకమర్తి. ఆ వెంకన్న బాగా చదివి, ప్రభుత్వోద్యోగియై, డిప్యూటీ తాసిల్దారయ్యాడు. అతడు తన కుమారునికి చిలకమర్తిపై గౌరవంతో లక్ష్మీనరసింహమని పేరుపెట్టాడు. మార్కండేయుడనే మరో పంచముడు కూడ తన కుమారుడికి లక్ష్మీనరసింహమని పేరుపెట్టాడు.

చిలకమర్తి వారి జీవిత విశేషాలలో పాఠశాల నిర్వహణ చాలా ముఖ్యమైంది. గాంధీజీ హరిజనోద్ధరణ ప్రారంభించడానికి ముందే చిలకమర్తివారు నిమ్నజాత్యుద్ధరణకై పాఠశాలలు స్థాపించటం వారి ప్రత్యేకతని చాటుతుంది:

చిలకమర్తివారు వాచకపుస్తకాలు రచించారు. ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ వారికి ఒకటినుండి ఐదో తరగతి వరకు సదాశివ వాచకములనే పేరున రచించి యిచ్చారు.

వివేక వాచకం యిలా వుండేది:

పద్యభాగము

చిలకమర్తి లక్ష్మీనరసింహము గారిచే విరచితము

చెన్నపురి, ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ లిమిటెడ్.

1930 వెల: 6 అణాలు

ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ గురించి చిలకమర్తి స్వీయచరిత్రలో వివరించారు. “చెన్నపురిలో ఇండియన్ పబ్లిషింగ్ హౌస్ అను గ్రంథప్రకటన సంఘముండెను

వారు తమకు కొన్ని తెలుగు వాచకములు వ్రాసి యిమ్మని నన్ను గోరిరి వాచకమునకు రు.500/– లు నాకిచ్చి, గుమస్తా జీతము వారు భరించునట్లు మేమొడంబడిక చేసికొంటిమి. వివేక వాచకములను పేర మొదటి ఫారము మొదలు నైదవ ఫారము వరకు, వ్రాసియిచ్చితిని. ఒడంబడిక ప్రకారము వారా సొమ్ము నాకిచ్చిరి." (స్వీయచరిత్ర – 580)

చిలకమర్తివారు వాచకాలు రచించడానికి అంగీకరించడంలో మరో విశేషముంది దేశమాత పత్రికను Subsidised paper గా దొరతనము వారికిచ్చుట కంగీకరించలేదు చిలకమర్తి. "దరిద్రుడవైన నీవు సంవత్సరమునకు కొన్నివేల రూపాయలు వచ్చెడి యవకాశము పోగొట్టుకొనుచున్నావని నా మిత్రులు నన్ను చివాట్లు పెట్టిరి" అని తెల్పారు. అయినా పత్రికా నిర్వహణలో స్వతంత్రము కావాలని, ప్రభుత్వాన్ని అవసరమైతే విమర్శించే అధికారం తనకుండాలని చిలకమర్తి అభిప్రాయం

అంతేకాక Macmillan Company అనే పుస్తక సంస్థ ఏజెంటు చిలకమర్తి వారిని తెలుగు వాచకాలు రాసి యిమ్మంటే, అంగీకరించలేదు చిలకమర్తి ఇప్పటికే ఆంగ్లేయులు మనదేశంలో గనులవల్ల, టీ, కాఫీలవల్ల, రైలుబండ్లవల్ల ధనమంతా పట్టుకుపోతున్నారు. తెలుగుదేశంలో పుట్టి, తెలుగు ముక్కలు నేర్చిన మనం, తెలుగు పుస్తకాలవల్ల వచ్చే లాభం అనుభవించకుండా అదికూడా ఆంగ్లేయుల కియ్యాలా? నేను ఇంగ్లీషు కంపెనీలకు గ్రంథము వ్రాసి యివ్వను. స్వదేశీయులెవరైనా ఒక కంపెనీ పెడితే వారికిస్తానన్నారు. నిత్య దారిద్ర్యంలో వున్నా దేశభక్తి కోసం అవకాశాన్ని పోగొట్టుకోవటం చిలకమర్తి వ్యక్తిత్వంలోని ప్రత్యేకత.

★ ★ ★

# చిలకమర్తి - పత్రికలు

భారతదేశంలో పాశ్చాత్య ప్రభావంతో వెలసిన వివిధ సాహిత్య ప్రక్రియల్లో పత్రికా నిర్వహణ మొదటిది. క్రైస్తవ మతప్రచారానికి ప్రారంభింపబడిన పత్రికలు చివరకు సారస్వత సేవకు సాధనాలైనాయి.

పత్రికా ప్రచురణ ద్వారా సాంఘిక దురాచార నిర్మూలనకు, సారస్వత వ్యాప్తికి కృషిచేసిన కందుకూరి వీరేశలింగంగారిని ప్రభావితం చేసిన పత్రిక లెన్నో వున్నాయి.

చిలకమర్తివారు 1898 నుంచి 1916 వరకు నిర్వహించిన పత్రికలు మూడు. ఎంత ఉత్సాహంగా ప్రారంభించినా రకరకాల పరిస్థితులవల్ల అంత నిరాశగా ముగించాల్సి వచ్చింది

## సరస్వతీ మాసపత్రిక:

న్యాపతి సుబ్బారావుగారు స్థాపించిన చింతామణి మాసపత్రిక వీరేశలింగం గారితో చెన్నపురి వెళ్ళిపోయింది. కనుక ఒక మంచి మాసపత్రిక ఆంధ్రదేశంలో వుండాలని చిలకమర్తివారు అనుకున్నారు. ఆ విషయం పోలవరం జమీందారు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావు బహదూరు వారితో సంప్రదించారు చిలకమర్తి. జమీందారుగారు ఆమోదించటం, "సరస్వతి" అనే పేరున పత్రిక పెట్టడం జరిగింది. అది రాజమహేంద్రవరంలో అచ్చుపడేది. దానికి జమీందారుగారు సంపాదకుడు, చిలకమర్తి సహాయ సంపాదకుడుగా వున్నారు.

సరస్వతీ మాసపత్రికలో మొదట దాసు శ్రీరాములు గారు తెనిగించిన ఉన్మత్త రాఘవము, మారన కవి రచించిన మార్కండేయ పురాణము ప్రచురింపబడ్డాయి. చిలకమర్తివారి సౌందర్యతిలక అనే నవల నెలనెలా ప్రచురింపబడింది. అయితే 1899 నాటికి జమీందారుగారి ఆలోచనలో కొత్త మార్పువచ్చింది – సరస్వతీ పత్రిక కాకినాడ నుంచే ప్రచురించాలని. కానీ చిలకమర్తికి ఇది నచ్చలేదు. కాకినాడ వెళ్ళటం సాధ్యపడలేదు.

చిలకమర్తి కాకినాడ రానన్నందుకు జమీందారు గారికి కోపం వచ్చింది. 1898లో సరస్వతి పత్రిక పెట్టిన కాలంలో చిలకమర్తికి 600 రూపాయలు ఉచితంగా యిచ్చారు జమీందారుగారు. కోపంగా వున్న జమీందారు ఆ ఆరువందలూ చిలకమర్తి వెంటనే యివ్వాలని, లేకపోతే దావా వేస్తానని రిజిస్టరు నోటీసు పంపారు. కానీ జమీందారు ఆ డబ్బు ఉచితంగా యియ్యలేదని, తనచేత ఉద్యోగం మాన్పించి పత్రిక పెట్టించినపుడు, తను అప్పులు తీర్చుకుందుకు యిచ్చారని చిలకమర్తి సమాధానమిచ్చారు. అయితే జమీందారు దానికి సమాధానం రాయకపోయినా, ఈ సంఘటనతో సరస్వతీ పత్రికకి, చిలకమర్తికి అనుబంధం తెగిపోయింది.

## మనోరమ పత్రిక:

1906 లో చిలకమర్తి వారు "మనోరమ" అనే మాసపత్రిక స్థాపించారు గున్నేశ్వరరావుగారి ముద్రాక్షరశాలలో ముద్రించారు. 1908 లో వివేకవర్ధనీ ముద్రాక్షర శాలలో కొంతభాగం చిత్రపు నరసింహారావుగారి నుండి కొన్నారు. దీనికి మనోరమా ముద్రాక్షరశాల అని పేరుపెట్టారు.

మనోరమ మాసపత్రికలో చిలకమర్తి గ్రంథాలు చాలా ముద్రింపబడ్డాయి (ప్రసన్న యాదవము, చతుర చంద్రహాసము, రాజస్థాన కథావళి, కర్పూర మంజరి ప్రథమభాగం, మహాపురుషుల జీవిత చరిత్రలు.)

మనోరమ పత్రిక త్వరగా ప్రసిద్ధమై మన్ననలు పొందింది. మనోరమ పత్రికలో విమర్శనాత్మక వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. రసికాభిరామము అనే చిన్న ప్రబంధాన్ని సెట్టి లక్ష్మీనరసింహంగారు చిలకమర్తికి పంపారు. అది శ్రీనాథుడు రాసాడని, సింహాచలంలో వైష్ణవుని యింట అముద్రిత తాటియాకుల ప్రతి దొరికిందని సెట్టి లక్ష్మీనరసింహంగారు రాసారు. ఆ గ్రంథాన్ని చిలకమర్తి వారు చదివించుకొని విన్నారు. అయితే ఆ గ్రంథాన్ని అరసికుడెవరో రాసి శ్రీనాథుని పేర పెడుతున్నాడనిపించింది చిలకమర్తికి. ఆ అభిప్రాయాన్ని మనోరమ పత్రికలో రాసారు. దాంతో సెట్టిగారు చిలకమర్తిపై కోపగించి, చిలకమర్తి గుడ్డివాడు కనుక సత్యము కనిపెట్టలేకపోయాడని రాశారు.

మనోరమ పత్రిక 1907 నాటికి ప్రారంభించిన ఏడాదికి పత్రికాధిపతి కొన్ని మాటలు చెప్పుకొన్నారు. స్వవిషయము అనే పేరున కొన్ని విషయాలు చిలకమర్తి అందులో రాశారు. రమారమి నాలుగు వందలమంది చందాదారులు ఆదుకోటంతో ఈ పత్రికా శిశువు పాలవేదన పడక పాలపాప చిన్నెలు మొదలగు బాలారిష్టముల సంతరింపక వెండియు నీయాంధ్ర భాషాభిమానుల అదరమునకు పాత్రమై కాలూని నిలిచి విద్దెములు చేస్తోందన్నారు. వీరరసప్రధానమగు కథ లనేకములు ప్రచురిస్తామని, మహారాష్ట్ర దేశస్థులైన మహాపురుషుల చరిత్రలు రాయటం మొదలుపెడతామని, మూడు నాటకాలు ప్రచురింపదలచామని రాశారు. "ఆంధ్రభాషాభిమానులందఱు దగు సహాయము చేసి మనోరమ యనుదిన ప్రవర్ధమానముగ జేయుదురు గాక" అంటూ చిలకమర్తి విన్నవించారు.

## దేశమాత వారపత్రిక:

"1909 వ సంవత్సర చివరి భాగమున మునుపు నడుపుచున్న మనోరమ అనే మాసపత్రికకు తోడుగా నొక వారపత్రికను గూడ నెలకొల్పవలయునని నాకు సంకల్పము కలిగినది" అన్నారు స్వీయచరిత్రలో (పే. 454).

దేశమాత పత్రికలో ముఖ్యవ్యాసము (Editorial), వృత్తాంతము లేక ఒక చిత్రకథ, హాస్యలత కూడ ప్రకటింపబడినది. చందాదారులెక్కువై కోర్టువేలములు ప్రకటనలు కూడ ఇందుండుటచేత దేశమాత పత్రిక చిలకమర్తి వారికి లాభదాయకంగానే వుండేది. ఇందులోని హాస్యలతలు, చిత్రకథలు, ప్రధాన వ్యాసాలు చిలకమర్తివారే రచించేవారు.

కొంతకాలమయ్యాక దేశమాత పత్రిక చిలకమర్తి కొక సమస్య అయింది. దొరతనము వారికి వ్యతిరేకముగ రాయకుండటానికై వారొక పద్ధతి పెట్టారు. చందాదారు లందరినీ దొరతనము వారే నిర్ణయించారు అంటే దొరతనము వారిపై వ్యతిరేక విషయాలు ఏవీ రాయకూడదు. కానీ చిలకమర్తి ఈ విధమైన పత్రికగా (Subsidised Paper) దేశమాతను చేయదలచలేదు. పత్రికని దొరతనం వారికిచ్చివేయటం ఆత్మని అమ్ముకొన్నట్టే అని భావించారు. "ధనమునకై బానిసగ నుండుట కిష్టపడలేదు" అన్నారు (స్వీయచరిత్ర - 477).

చిలకమర్తి నిర్వహించిన మూడు పత్రికలూ సాహిత్య పత్రికలే. సమకాలీన సాహిత్య చైతన్యానికి అవి దోహదం చేసేవి. సాహిత్య పత్రికల కుండవలసిన ఉత్తమ ప్రమాణాలను చిలకమర్తి పోషించారు ఆ పత్రికల్లో ధారావాహికంగా నవలలు నాటకాలు ప్రచురించి, అముద్రిత గ్రంథాలు ప్రచురించి, సాహిత్య విమర్శలు సాహిత్య చర్చలు చేసి ఆ పత్రికలకు ఒక గౌరవ స్థానాన్ని కల్పించారు. చిలకమర్తి వారి పత్రికలు దేశభక్తినీ సాహిత్య శక్తినీ తెలుగువారి కందించాయి.

★ ★ ★